శేఖ : [illegible]! [illegible] తెలివితక్కువవాడా. అదే! ఆ చ[illegible]
న్నావే అలా కూర్చో!

చెం : కు...కు... కుర్చీ తెక్క్యాపుంటారండీ? చి... చి...,
చిత్తం! (వెళ్ళబోతాడు)

శేఖ : (గట్టిగా) కుర్చీ కాదు, కూర్చో!

తార : బయట కారుంది. వాడిని వెళ్ళనీయండి.

శేఖ : ఓయస్ అలాగే

చెం : వె... వె... వెళ్ళమంతారా?

తార : (చేతుల సి బాగ్ ఊపుతూ నవ్వుకుంటాది)

శేఖ : (గట్టిగా) కారుదగ్గిర కెళ్ళమంటున్నారు.

చెం : ఓఁ అదా! చె... చె... చెప్పేరుగాదే! నాయింటూ
పటారంగానూ! (బయటకు వెళ్తాడు)

చం : (ప్రవేశించి) హల్లో గుడ్ మార్నింగండీ!

తార : వెరీ గుడ్ మార్నింగ్! (తదేకదీక్షతో చంద్రం కళ్ళ
ల్లోకి చూస్తుంది. చంద్రంకూడా తార కండ్లతో తన
కండ్లు ఏకంచేసి లోకం మరచిపోతాడు)

శేఖ : (వాళ్ళనుచూస్తూ తనలోతాను నవ్వుకొని) చంద్రం!
చంద్రం!!

తార : (ఆమాటలు విని సిగ్గుపడి తలవాల్చుకుంటుంది)

చం : (కంగారుగా ఓసారీ! అన్నట్లు ఎంతసేపయిందండి
తమరు దయచేసి ?

శేఖ ; (నవ్వుతూ) ఏరా! అప్పుడే యీలోకాన్ని విడచి
ఇంద్రలోకంలో విహారిస్తున్నారు! అవునులే, ఎప్పటి

కైలాసాన, తెలగపిండి ఒకటేగా! మధ్య తేను కులవాడే యెరుసు అన్నట్లు మీరూమీరూ ఒక్కటే (అందరూ నవ్వుతారు)

చం : అప్పుడు మన కాలేజీ యూనివర్సిటీలో మనం కలిసి వేసిన డ్యాన్సు జ్ఞాపకముందా మీకు?

తార : లేకేం ఆ డ్యాన్సునే ఎల్లప్పుడు తలచి తలచి...

శేఖ : (నవ్వుతూ) కలసిపోయుంటారు ఊహాలో

తార : (గారంగా) పోండన్నా్య నువ్వు మరీనీ.

శేఖ : (నవ్వుతూ) అప్రసన్న! పున్నమాటంటే ఉలుకే గదమ్మా!

చం : చాల్లేరా నీ విద్య!

శేఖ : (నవ్వుతూ) అట్లను. నేనెందుకు మీమధ్య వస్తా! టా! టా! (వెళ్ళబోతాడు)

తార : అన్నయ్యా! కూర్చో అన్నయ్యా! అస్తమానూ మా అన్నయ్యకూ అల్లరే!

చం : (నవ్వుతూ) అది వాడికి చిన్నప్పటినుండి అలవాటేగా ఆఁ శేఖర్! మన మస్తాను ఏడీ.

శేఖ : లేకేం! కేకేస్తాను (గట్టిగా) ఏ మస్తాన్.

మస్తా: (లోపలినుండి) జీ సర్కార్! గరమ్ గరమ్ చాయ్ లాతాహూఁ.

శేఖ : (నవ్వుతూ) వీడ్ని చూచారా! టీ కూడా తెస్తున్నాడట!

మస్తా: (మరూడు టీలు పట్టుకొని ఈల పాట పాడుకొంటూ వచ్చి టీ తారకు యిచ్చి) దారమ్మాగార్ నమస్తే (శేఖరుకు టీ యిచ్చి) శేఖర్ బాబుకి నమస్తే! (చంద్రానికి టీ యిచ్చి) చంద్రం బాబుగారికి నమస్తే (అందరూ నవ్వుతారు)

శేఖ : (కాఫీ త్రాగుతూ) ఆఁ! సిస్టర్! యింతకూ మీ రేజి ఎప్పుడన్నారు ?

తార: (సిగ్గుగా) టుమారో!

మస్తా: హారే! షాదీ! కౌన్ కి హాండీ ?

శేఖ : (చంద్రం వంక చూచి) యింకెవరికి ? అరుగో! మీ అయ్యగారు. (నవ్వుతూ) వీరే మీ అమ్మగారు. యిక యీ యేటి కిద్దరే! ముందేటికి ముగ్గురూ!

మస్తా: జీ! హారా ఉషార్! వా రే సాల్లా? అభి మేరా దిల్ దేఖో కై సేహువా? (అందరూ నవ్వుతారు)

శేఖ : అయితే యిక యీ మస్తానుకు పట్టపగ్గాలుండవు. అఁ! మస్తాన్! నీవు లోనికి వెళ్ళి ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చెయ్యి. యీలోగా మనకు కావలసిన ఫ్రెండ్సుని పిలుసుకువస్తా. ఆఁ! చంద్రం నేను పనులన్నీ ముగించుకు వస్తా. సిష్టర్ సిరియో! (బయటకు వెళ్తాడు)

చం : పట్టి బంగారు మృగం! (యిరువురూ నవ్వుతారు కొన్ని క్షణాలవరకూ నిశ్శబ్దం. ఒకరి నొకరు అన్యో

[illegible] చంద్రం ఏదో పుస్తకం తీసి ధ్యానంగా చదువుతున్నట్లు నటిస్తాడు.)

తార: (తడబడుతూ) ఏమండీ!

చం : (తల ఎత్తకుండా) ఊఁ!

తార: (నవ్వుతూ) ఫస్టుక్లాసు వచ్చినా పట్లు విడవరా శ్రీవారు,

చం : (తేరుకొని) ఏమన్నారు, (పుస్తకం డ్రాయరుమీద వుంచుతాడు).

తార: ఊఁ! ఊఁ! ఏమీ లేదూ! శ్రీవారికి పట్టుదల ఎక్కువంటున్నాను.

చం : తమకంటేనా ?

తార: నాకేం పట్టుదల ?

చం : లేకేం! పున్నపు చంద్రుడిమి పున్నమినాడే అంధకార అమావాస్యలో పడితే తళతళ మెరిసే తారవై దారి చూపుతున్నావు. ఇంకేం కావాలి ?

తార: అబ్బా! చాల్లెండి మీ మాటలు.

చం : మాటలుకాదు తారా! నాలో యేవిశిష్టత వున్నదని నన్ను ప్రేమించావు. అందనిపండు కాశించి చివరకి అందుకుంటున్నావ్! తరువాత బాధపడతావేమో!

తార: ఏమండీ! నన్ను యింకా అర్థం చేసుకోలేదా.

చం : అర్థం చేసుకోవటంకాదు తారా! నీ విశాల మనోభావాన్ని ఏనాడో అర్థంచేసుకున్నాను. కాని, చంద్రమండలానికి నక్షత్రాలు ఎంతో మెత్తున్నాయి.

తార : చంద్రా! నన్ను వేధించి బాధించరు. నేను అన్నీ విన్నాను. ఇక నన్ను మన్నించి నామనోనిశ్చయాన్ని పూర్ప్తికండి. నీవే నా రథ సారథివి. (లేచిచంద్రాన్ని సమీపించి అతని చేతులు పట్టుకుని) ఏమండీ! నేనంటే మీకు యిష్టంలేదా?

చం : (లేచి ఆమె చేతులు పట్టుకొని) యిష్టములేక కాదు తారా, దైవమేనాకు ప్రసాదిస్తే ఎల్లప్పుడు నీసరస సల్లాప సుఖానుభూతిలో తేలియాడాలనే ఆశిస్తున్నాను.

తార: నిజంగా! (ఆనంద భాష్పాలు విడుస్తాది)

చం : (ఆనందంతో) నిజమే తారా! (తన హృదయానికి అన్చుకొని కన్నీళ్ళు తుడుస్తాడు)

తార: ఇన్నాళ్ళకు ఈ మృదుమధుర సుధారపు నోటినుండి మాటవింటిని. (ఆనందంతో) ఇన్నాళ్ళనుండి ఏ వెన్నెల రాజునీడలో గూడుకట్టుకొని ఆడుకోవాలని ప్రయత్నించేనో ఆ నా ప్రయత్నం యీనాటికి ఫలించింది. ఇక ధన్యురాలనయ్యాను చంద్రా!

చం : ఏం!

తార: (తేరుకొని బాహువుల్లోంచి విడిపించుకొని) ప్రొద్దుపోయింది. యిక నేను వెళ్ళివస్తాను. రేపే మన ప్రయాణం.

చం : (నవ్వుతూ) అలాగే! కానీ...

తార: ఏంటది?

చం : (పేంటు జేబులలో చేతులు పెట్టుకొని చిరునవ్వులతో) మనం కలుసుకొని చాలా రోజులయింది.

తార: (జడ సర్దుకొంటూ ఆశ్చర్యంగా) ఆఁ! అందుకని?

చం : ఇప్పుడు అన్నీ నిశ్చయమయ్యాయిగా!

తార: (కొంటెగా చూస్తూ) అందుకని?

చం : ఆనందంతో ఒక్కసారి!

తార: (ముసిముసి నవ్వులతో) అంటే?

చం : (తడబడుతూ) అబ్బే! ఏమీ లేదు. (తేరుకొని) తారా!

తార: (కొంటె చూపులతో) ఏమండీ!

చం : (దగ్గరకు వెళ్ళి ఆమె భుజంమీద చెయ్యివేసి రెండవ చేతితో ప్రేమాతిశయముతో శూన్యాకాశములోనికి (చూపుతూ) చూడు తారా! ఆ మేఘాలబుద్ధి.

తార: (ఆకాశాన్ని చూస్తూ) ఏం చేస్తున్నాయి?

చం : ఇంకేం చెయ్యాలి. ప్రశాంతంగా ప్రకాశించే చంద్రుడ్ని చాటుగా మాటుపర్చి మిళుకుమిళుకు మెరసే తారలకాంతిని తళతళ మెరసేటట్లుగా లోకాన్ని నిశిదాంధకారముగా మార్చేస్తున్నాయి. అంత స్వార్థం ఎందుకు? (ఆమెను తనపక్కానికి ఆన్చుకుని బుగ్గలపై ముద్దు పెట్టుకోబోతాడు)

తార: (తన రెండు చేతులతో కండ్లు మూసుకొని నెమ్మదిగా తప్పించుకొంటూ ప్రేమగా) అలాగా.

చం : (నవ్వుతూ) ఊ! [illegible] చూస్తానుగా! (పైట చెంగు లాగుతాడు. ఆమె ఒక చేతితో చాతీమీద చెయ్యి వేసి ఆపైటను ఆపుకుంటూ నెమ్మదిగా అతని ఒడిలోనికి వస్తాది. అతడు పైట వదులుతాడు.)

తార : (తన్మయత్వంతో) చంద్రా! ఎన్ని కారుమబ్బులు కాదనినా, ఆవరించినా ఈ తార చంద్రుని కొరకే తహతహలాడుతుంది.

చం : (ఆమెను గట్టిగా తన హృదయానికి అన్చుకొని ప్రేమగా) అలాగా!

తార : ఏ ప్రియుని కనుసన్నలతో ఆసన్నమవ్వాలనుకొన్నానో ఏ ప్రియుని సాన్నిధ్యాన్ని వరించి తరించాలని తనువు కలిపి మనవు సాగించాలని నిశ్చయించుకొన్నానో, ఆ ప్రియమూర్తిని ప్రసాదించిన ఆ పద్మనాభునికి నాఅభి వందనము. (కనులు మూసుకొని తన్మయత్వం పొందు తుంది)

చం : (తల నిమురుతూ) తారా! నీలాంటి ఆదర్శమూర్తిని భార్యగా పొందిన నేను చాలాఅదృష్టవంతుణ్ణి. ఆఁ! తారా! ఏదీ ఆనాడు మనం కాలేజీ వార్షికోత్సవ సందర్భంలో పాడిన పాట.

తార : ఏ పాట ?

చం : అదే! తారాచంద్రులం నీ నీలి మేఘాలతో తేలిఆడిన దోబూచులాట.

తార : (నవ్వుతూ) ఓః! ఆపాటా? అయితే ముందు మీరేగా పాడుతా.

చం : ఊహుఁ! ముందునీవే! ఏదీ పాడు! (బుగ్గపై చేతి వ్రేలితో కొడతాడు. ఆమె అతని బాహుపంజరం నుండి విదల్చుకొంటాది. అతడు ప్రేమగా పైట పట్టు కొంటాడు. ఆమె నవ్వుతూ 'మీకు పుణ్యముంటుంది ఊరుకోండి!' అన్నట్లు సైగచేస్తుంది. అతడు వదల నన్నట్లు తలవూపి పైట వదుల్తాడు)

తార : (పైట సర్దుకుంటూ నృత్యాన్ని అభినయిస్తూ పాట పాడును)

పున్నమి వెలసిన - సుందరుడా
వెన్నెల విరిసిన - చందురుడా
నిను చూడగనే - మనసాయెను లే
నా మదిలో మనవి - విన వేలా! ...పున్నమి

చం : తళతళ మెరిసే - ఓ తారా,
నిను వలచితినే - మనసారా,
నిను చూడగనే - మనసాయెను లే
నీ మనసే తెలిసెను - విన వేలా! ...తళతళ

తార : నీ వెన్నెల కోసమే - చకోరినై
నా కన్నుల కోరిక - తీరుటకై
నీ కోసము నే - వేసారితిరా
నను చేరగ రావా - జాగేలా ...పున్నమి

తా-చం : మన మానసులు - కలసిన నేడే!
మన కలలు - ఫలించెను ఈనాడే
తారాచంద్రుల - విహారమూ
తియ్యని వెన్నెల - వికాశమూ
ప్రేమికులకు యిది - వినోదమూ!
ఆ...ఆ...ఆ...!!

(పాట అనంతరం తారను భుజానికి ఆన్చుకుని తల నిమురుతూ తన్మయత్వం చెందుతాడు)

తార: (కొంతసేపటికి తేరుకొని) ఏమండీ!

చం : (చిరునవ్వుతో) ఏం?

తార: ఇక నేను వెళ్ళిరానా!

చం : అప్పుడే.

తార: రేపే మన ప్రయాణం. లగ్నం టైముకు ముందుగా మనం అక్కడికి చేరుకోవాలి. అక్కడ మా నాన్న గారు మనకొరకు ఎదురుచూస్తారు. మీరు తెల్లవార గానే బయలుదేరండి. నేను కారు పంపిస్తాను. అందరం కలసే వెళదాం. (అతని చొక్కా మెత్తము సవరించు తాది.)

చం : తన చేతివేలితో బుగ్గను గిల్లి) ఓ కె. (చొక్కా కాలరు సర్దుకొని లోనికి వెళ్తాడు)

తార: (పైట సర్దుకొని హేండ్ బాగ్ వూపుకొంటూ వీధి లోనికి వెళ్లబోతుంది. ఎదురుగా శంకరం సిగరెట్టు కాల్చుకుంటూ వస్తాడు. అతన్ని చూచి ఆశ్చర్యంగా నిర్ఘాంతపోయి) బా...వా!

సూ : మరి ఇంకేమిటయ్యా?

చం : (నవ్వుతూ తలవంచుకుని) మరి...మరి...

సూర: చెప్పవయ్యా!

చం : నేను పరీక్షలో ప్యాసయ్యానయ్యా!

సూ : (చంద్రాన్ని కౌగలించుకొని ఆనందంతో గిరగిర తిప్పుతూ) గుడ్ - గుడ్! మా తమ్ముడు గుడ్ గుడ్‌గా పాసవుతాడని నాకేనాడో తెలుసు!

సూర: (ఆనందభాష్పాలు విడుస్తాడు-సూర్యం చూస్తాడు)

సూ : (కౌగలి తలోనున్న చంద్రాన్ని విడిచి) అదేమిటి నాన్న! ఈ అంతులేని ఆనందంలో గట్టులేని సముద్రమువలె పొంగి పొరలవలసిన నీవే గట్టు తెగిన కోనేటిలా నిలచుండి కన్నీరుస్తున్నావ్!

సూర: (కన్నీళ్ళు తుడుచుకుంటూ) అదికాదు బాబూ! ఈ ఆనంద సమయంలో మీఅమ్మవుంటే ఎంత పొంగి పోయేదో! అందుకోను చిన్నోడ తే మరీను. వాడికి అయిదేళ్ళు అవకుండానే మీఅమ్మ పోయింది

సూ : (జాలిగా) పోనీలే నాన్న! నీవుమాత్రం ఎన్ని మందులు వేయించావు! ఎంతమంది డాక్టర్లకు ధనాన్ని గుప్పి దాసోహం చేశావ్! అయినా అదేం పాడుజ్వరమో గాని నాతల్లిని తరగదీసి తరుముకుపోయింది. పోనీ నాన్న! నీవు అస్తమానూ అలా వుంటే మాత్రం పోయినవాళ్ళు తిరిగి వస్తారా? అయినా తమ్ముడు

గురించి నీకేదిగులూ అక్కర్లేదు. అమ్మ పోయినా అన్ననున్నాగా! తమ్ముడు సంగతంతా నేను చూచు కుంటాను. నాకా రెండక్షింతలు నీచేతితోనే వేసావు!

సూర: ఆఁ! నాచేతితో అక్షింతలు వేస్తేమాత్రం ఏంలాభం! అదక్కడా - నీవిక్కడా!

సూ : ఏం చెయ్యమంటావు నాన్న! నే నొద్దన్నా మేనరికం కదాయని, కాదనలేక కట్టపెట్టావ్. వాళ్ళు మెల్లగా ఇల్లరికం రమ్మంటారు. నేనేం సన్యాసి ననుకున్నారా ఇల్లరికం రమ్మనటానికి? ఇల్లు - వాకిలి, నిన్ను — తమ్ముడ్ని విడిచి పోతానా? ఏనాటికైనా వాళ్ళంతట వాళ్ళే లొంగి వచ్చిననాడే తొంగి చూద్దాం మనం ఆఁ! నువ్వు లోనికి వెళ్ళి భోంచెయ్యి నాన్న!

సూర: మీ యిష్టం వచ్చినట్లే చెయ్యండ్రా: మీ అన్నా దమ్ములకు సరిపోయింది (నవ్వుతూ లోనికి పోతాడు. తరువాత సూర్యం - చంద్రం నవ్వుకుంటారు)

చం : ఏంటన్నయ్యా నీ పంతం; అత్తవారు ఆసరాగా అల్లుడ్ని ఇల్లరికం రమ్మన్నంత మాత్రాన అంత చులకనగా చూడకూడ దన్నయ్యా!

సూ : ఇదిగో! తమ్ముడూ! మేనరికంగదాయని ఇల్లరికం వెళ్ళితే ఆ మేనరికం పేరుతో మనం నరకం అనుభ వించ వలసిందే!

చం : అయితే మంచి సిద్ధాంత మన్నయ్యా నీది!

సూ : అవును తమ్ముడూ! వేదాంతమైనా-రాద్ధాంతమైనా మన సిద్ధాంతానికి తిరుగు లేదు.

చం : (తలగోక్కుంటూ) అన్నయ్యా!...

సూ : చెప్పు తమ్ముడూ! నాదగ్గర నీకు సిగ్గెందుకూ? ఏం పెళ్ళికావాలా? చెప్పు! (చిన్నగా నవ్వుతాడు)

చం : పో అన్నయ్యా! నీ వెప్పుడు నాతో నవ్వులాటే!

సూ : మరి చెప్పరా?

చం : నాకు ఇంకా చదువుకోవాలని వుదన్నయ్యా!

సూ : ఓ అదా! ఈపాటిదానికి ఈపాటి దాపరిక మెందుకు? చదువుకో!

చం : ఇక్కడా? చదవనీయు రన్నయ్యా!

సూ : (కోపంగా) ఆఁ! ఎవడ్రా నిన్ను చదవనీయని సన్యాసి? వాడంతు కనుక్కుంటాను

చం : (చిన్నగా నవ్వి) అదిగాదన్నయ్యా! ఇక్కడ స్కూలు ఫైనల్ వర్కేగావుంది! ఇప్పుడు నేనెలాగా స్కూల్ ఫైనల్ పాసయ్యానుగా! ఇంక చదవాలంటే పట్నం వెళ్ళాలి.

సూ : ఓఁ! అదా సంగతి? (నవ్వి) పట్నంలో చదవాలంటే పదిలా - పాతికలా! వందలు బిందెలతో నిండి యుండాలి. అసలే మనదగ్గర డబ్బులేదు. పండిన

పంటంతా ఆ జమిందారు కుటుంబరావుగార్కి జమ కట్టవలసి వస్తుంది. ఎంత జమకట్టినా ఆ బాకీ కూడా తీరటంలేదు. (నిట్టూర్చి) ఆఁ! ఇంతకీ ఎంత డబ్బు వుండాలి ?

చం : కనీసం సంవత్సరానికి వెయ్యి రూపాయి లుండాలి అన్నియ్యా !

సూ : (ఆశ్చర్యంగా) వెయ్యిరూపాయలే ? (ఆలోచిస్తాడు)

చం : పోనీలే అన్నయ్యా ! అప్పులతో తిప్పలుపడి నన్ను చదివించవద్దు.

సూ : (ఆవేశంతో) తమ్ముడూ ! ముప్పులు కుప్పలై నా నిన్ను తప్పక చదివిస్తాను. నీవేమీ బాధపడకు. నేనలా యువజన సంఘ సమావేశానికి వెళ్ళివస్తాను. (బయటకు వెళ్తాడు)

చం : (ఆనందంతో వెళ్లే సూర్యాన్ని చూచి నవ్వుతూ లోనికెళ్తాడు)

చెంచయ్య: (బయటనుండి వస్తూ పాట పాడుతూ)

నాపేరు చెంచయ్య - నాకంటే నాజెవ్వరూ
నాపేరు చెంచయ్య - నాకంటే నాజెవ్వరూ
నానప్పుడూ మోజంటే
నానప్పుడూ రాజంటే ॥నానప్పుడు
రాజూ మోజూ కూడిందంటే
నాఊపు మో - మోమోతా ! ॥నాపేరు

నా నాజూకు మీసాలూ
పిల్లను రమ్మని పిలిచే ॥నానాజూకు
పిల్లా ఒళ్ళు తాకాగానే
నాకళ్ళు - గిరగిరా ॥నాపేరు
ఘూటైన గరపాకు
దవడపీకు లంకాకు ॥ఘూటైన
భుజాన కోరకంచు
బూరుంపూడి పుగాకు ॥నాపేరు

చెం : న...న...నా యింటా పటారంగాను...ఇంటికాడ ఎవ్వరూ నేరేంటి చెప్పా! నే కేడ కెళ్తారు? నో నుంతారు! కూడు నేకపోతే కూకుంతా కాని చుట్ట ముక్క నేకపోతే పానం రెపరెపా, రెపరెపా కొట్టు కుంతాది కదా! సూడొత్తే అందరు సుట్టాలేకదా! చుట్టము క్కడిగితే చు...చు... చుక్క న్నొక్కడ తారు ఆ...ఆ...ఆఖరి కేది కావలసినా సూరయ్య కాపుంటికి రావలసిందే గదా? సూరయ్యకాపా, ఓ సూరయ్యకాపా! (లోనికి చూస్తాడు.)

సూర: (ప్రవేశించి) ఏం చెంచయ్యా! కూకో!

చెం : నమస్కారం బాబూ! క్యాకేసా నంతారా! అవు నండి, రెండుసార్లు!

సూర: ఏంటిలా వచ్చావ్! మాంమోలు కోసమేనా?

చెం : చిత్రం! తుమాలంటారా! మొన్నే కొన్నానండీ?
(భుజంమీదనున్న తుండుతీసి చూపిస్తాడు.)

సూర: తుమాలు కాదు. పొగాకు మామూ లంటున్నాను.

చెం : (చెవ్వికి చెయ్యి అడ్డుపెట్టి) అయ్యో బాబూ! పొగాకు ముక్కంటారా! నాయింత పటారంగానూ, దాని కోసమేగదండీ నానొత్తా!

సూర: (పొగాకు ముక్క ఇస్తూ) ఇందా! నీతో చావొచ్చి పడింది.

చె : (పొగాకు ముక్క తీసికొని, కళ్ళకద్దుకొని, వాసన చూచి) గాటుగావుంది, గరపాకా బాబూ!

సూర: కాదు, లంకాకే!

చెం : ఏంటీ! లంకాదానంలాగా కాల్తాదంటారా! చిత్రం!

సూర: సరేలే! అయ్యగారు ఇంటివగ్గరే ఉన్నారా?

చెం : (నవ్వి) అమ్మగారికి ఇంకా పెళ్ళికుదర నేదంటారా! చిత్రం, నేదండీ.

సూర: (తలపూపుతూ నవ్వి) బాగుంది! ఒకటంటే ఒక టంటావ్! అఁ, అమ్మాయిగారు ఇంకా ఆ ఆడపిల్లల బడిలోనే చదువుతున్నారా?

చెం : (గట్టిగా నవ్వి) ఇంకా ఈ వయస్సులో అయ్యగారికి పెళ్ళెందుకండీ!

సూర: (చిన్నగా నవ్వుకుంటాడు)

చెం : సూర్యం బాబేడండి!

సూర: ఊళ్ళో కెళ్ళాడు.

చెం : అయ్యొబాబు! ఉండమంటారా! నా వెళ్తానండి! బళ్ళో కెళ్తే అమ్మాయిగారి బండి కూడా నానే వుండాలిగా! ఎల్తానండి! (చెంచయ్య బయటకు వెళ్తుండగా సూరయ్య లోనికి వెళ్తాడు. చలపతి ప్రవేశిస్తూ యెదురు వచ్చిన చెంచయ్యను కిట్టని వాడిలా చూస్తాడు. చెంచయ్య తన భుజంమీద నున్న తుండును ఒకసారి నిర్లక్ష్యంగా దులిపి బయటకు వెళ్తాడు.)

చల : ఆఁ. ఇక పని అయినట్టే! చెవిటి ముండాకొడుకు ఎదురొచ్చాడు! (లోనికి చూస్తూ) సూరయ్యా! ఓ సూరయ్యా!

సూర: (ప్రవేశించి) ఎవరు బాబూ! చలపతిగారా! రండి బాబూ, రండి! కూర్చోండి! (చలపతి కుర్చీలో కూర్చుంటాడు.) ఏం బాబూ! పెద్దబాబుగారు, శంకరం బాబుగారు, అమ్మాయిగారు అంతా బాగున్నారా బాబు?

చం : అంతా బాగానే యున్నారుగాని, ముందు బాకీ మాట చెప్పవయ్యా! చిన్నయ్యగారు ఖచ్చితంగా వసూలు చేసి తీసుకురమ్మన్నారు, ఏమంటావు!

సూర : అదేటి బాబూ! మొన్నగదా పండిన పంటంతా అయినకాడికి యాభై బస్తాల ధాన్యం తోలుపెట్టాను ఇంట్లో చూస్తే గంజికైనా చేరెడు గింజల్లేవు. ఆ పెద్దోడు బండి తోలుతుంటే అలాగే కాలం గడుపు. తున్నాము.

చల : (ఈర్ష్యగా) పెద్దోడు బండితోల్తే చిన్నోడ్ని కమతం పెట్టయినా మా బాకీ తీర్చవలసిందే! (బయటనుండి సూర్యం వస్తాడు)

సూ : ఎవర్నయ్యా కమతం పెట్టేది? నీ కొడుకుని పెట్టు రెండు సంవత్సరాలనుండి పరీక్షలు తప్పి సన్యాసిలా తయారైన నీకొడుకునిపెట్టు అంతేగాని, నాతమ్ముడు మాకెత్తేవా పళ్ళురాల్తాయి స్కూల్ ఫైనల్ పరీక్ష పాసయ్యాడయ్యా - స్కూల్ ఫైనల్.

చల : (తనలో) ఏంటీ! వీడు పరీక్ష పాసయ్యాడా? సరేలే! (సూర్యాన్ని చూసి) పళ్ళురాలడం నేను చూస్తాను గానీ, ముందు బాకీమాట చెప్పండి.

సూర : (కంగారుగా) బాబూ! వాడి మాటలు పట్టించు కోకండి! (బతిమాలుతాడు)

సూ : నువ్వూరుకో నాన్నా! (హేళనగా) బాకీ సంగతి పెద బాబుగారే అడగమన్నారా? లేక మీ చెలికాడు శంకరంగారే అడగమన్నారాండీ గుమాస్తాగారు

చల : శ్రీ శ్రీ శ్రీ జమీందారు కుటుంబరావుగారి మేనల్లుడు, రాబోయేఅల్లుడు శంకరంగారు పంపించారు. మొతం జమలన్నీపోను యింకా రెండువేల, రెండువందల, రెండురూపాయల, యిడ్వై రెండు నయాపైసల బాకీ వుంది, నయాపైసలతో సహా యిప్పుడిచ్చితీరవల సిందే!

సూర : (వినయంగా) చలపతిగారూ! నేను అప్పు తెచ్చింది-మీచేతితో యిచ్చింది వెయ్యి రూపాయలే కదండి! దానికి యాభై బస్తాల ధాన్యం, నాలుగు బస్తా అప రాలు యిచ్చేను. ఇంకా యింతబాకీ యెక్కడిద డి? ఇదేమన్నా న్యాయంగావుందా? ఇదంతా చూస్తుంటే ఏదో మాయగా వుంది.

చల : మెల్లగా అప్పులు తెచ్చుకొని చల్లగా ఊరుకుంటే పిల్లలు పెరిగినట్లు పెరిగి ఊరుకుంటుంది

సూ : (హేళనగా చేతులు నలుపుతూ) అయ్యా! చలపతి గారు! తమ గుమస్తాగిరిలో యింతచక్కటి లెక్కలు వ్రాయటం ఇదే మొదటిసారాండి? లేక అలవాటు తప్పి పరిపాటులో పొరపాటుపడి మమ్మ నలగురిలో నగుబాటు చేస్తే నీకు పట్టే అగచాట్లు చెప్పలేం జాగ్రత్త! ఆలోచించుకోండి! (పళ్ళు పటపటకొరికి) నిజం చెప్పండి. నేను వచ్చి పెదబాబును కలుసు కొంటాను.

ములు లేకపోవచ్చు. మనిషికి మనసిచ్చిసాటి మానవుడిగా గుర్తించడం తప్ప పశువత్వం మనలో లేకపోవచ్చు; నాన్నా! ఒకటిమాత్రం గుర్తించుకో! మనలాంటి యావత్తు భారత సోదరులంతా హలం పట్టి పొలం దున్నకపోతే యీ జమీలు, జమీందారులు యేమౌతారో ఆలోచించండి.

సూర : ఎన్ని ఆలోచించినా పడే కష్టాలు మాత్రం తప్పడం లేదుగా !

సూ : కష్టమైనా, నష్టమైనా, ఇష్టముగా నేను చూచుకుంటానుగాని మీరు కదలకుండా ఇంట్లోవుండండి. ఆఁ అన్నట్లు చెప్పడం మరచాను నాన్నా! తమ్ముణ్ణి చదువుకోసం పట్నంపంపుదామనివుంది ఏమంటావ్ ?

సూర : కూకుని లేవ లేనంటే-వంగుని తీర్థము వెళ్తానన్నాడట, నీలాంటోడే! యిప్పటివరకూ అప్పులుబాధ పడలేక చస్తుంటే ఇంకా అప్పుచేసి పప్పుకూడంటావేమిట్రా?

సూ : అప్పైనా, అప్పులు ముప్పులైనా తప్పదు నాన్నా! తమ్ముణ్ణి చదివించితీరాలి. ఏమైనాసరే తమ్ముడు 'లా' చదివి 'లాయరై' ఈ ధనికవర్గం చేస్తున్న దుండగాన్ని ఖండించి తీరాలి. ఎన్నిబాధలు పడ్డైనా సరే తమ్ముడికిచ్చిన మాట నిలబెట్టుకుంటాను. ఆఁ! నాన్నా! నీవు యింట్లోవుండు. నేనిప్పుడే వస్తాను. (బయటకు వెళ్తాడు సూరయ్య లోనికి వెళ్తాడు.)

తెర

# రక్తపాశం

## 2 వ రంగం

[రంగాలంకరణంతా ఒక జమీందారి కుటుంబానికి చెందిన ఒక పెద్ద బంగళాయై యుంటుంది. అది కుటుంబరావుగారి భవంతి. కుర్చీలు, సోఫాలు పూలకుండీలు వుంటాయి. తెరలేచేసరికి తార మేడమెట్లు దిగుతూ పాట పాడుకుంటూ వస్తుంది. పాట పూర్తి అవగానే చెంచయ్య వస్తాడు.]

హాయిగదా - జీవితమే హాయిగదా !

వన్నెలలో........................

వన్నెలలో - సెలయేటి యిసుక తిన్నెలలో

ప్రకృతి వింత - సుందరమే హాయిగదా....హాయి

కన్నుల పండుగ ఈ రేయీ

విరబూసిన వెన్నెల హాయీ

మది! ఎంతో పులకరించెనోయీ-ఓహో! వెన్నెలరాజ!

చందురుడా - దిగిరావోయీ ...హాయీ

కలవలు విరసిన వెన్నెలలో

మగువలు వలసిన వలపులలో

తలపగారావా ఊహాలతో - ఓహో ! వెన్నెలరాజా !

చందురుడా - చేరరావోయీ ...హాయి

చెం : బ...బ...బలే! వ...వ...వండ్రపుల్ గా వుందిమ్మ అచ్చంగా ! దొరసనమ్మగారిన పాడేసినారమ్మా ! నా...న...నాన్నాడమంత రేంటి ! నాను ఆడెత్తను.

తార : ఏమిటి నీ మొఖం ! నీవేమాడతావ్ ? ఆట పాట అంటే నేర్చుకొని యుండాలి.

చెం : నాయింటా పటారంగాను నా కెదుగ లేదంటున్నా రేంటి ? మొన్న హైదరాబాదులో అందగత్తెలు ఆడుతుంటే నేను నేర్చుకున్నాను. (అభినయం చూపుతూ) యిలా యిలా నడుస్తూ - యిలా యిలా త్రిప్పుకుంటూ ఆడుతుంటే గొప్ప గొప్ప వాళ్ళంతా వాళ్ళను ప్రేమించేస్తుంటున్నారమ్మా

తార : ఏమిటే నీ మొఖం! వాళ్ళు అంత అందంగా వుంటారా?

చెం : ఏమిటి అందం లేదంటారా? ఏడు జిల్లాలికి ఏకంద గత్తెలమ్మ (నపుంసకునివలె నటించి) వాళ్ళు యిలా యిలా నటిస్తూ - యిలా యిలా తిప్పుకుంటూ డేన్సు ఆడుతుంటే ఆళ ఆట పాట చూసి పెద్ద పెద్దోళ్ళే పేమిస్తున్నారమ్మగోరు!

తార : ఛ్ఛీ...ఊరుకో వెధవ మాటలు నీవును!

చెం : ఏంటి ! నానూరుకున్నా నంటారా? ఏం చేయ మంటారు? ఎప్పుడు మీకూడా నే బడిలోకెళ్తే బండికూడా రావాలి ఇంకెక్కడ నాకు తీరుతుందమ్మ ఆదారంనాడు అంచక్క చెలవొచ్చింది కదాయని నా నలే అందగత్తెలందరు ఆదారంకనుక దవళేశ్వరం సంతకి దౌడాయించారు. ఇక నానేం చెయ్యానండి?

తార : నీనెత్తి ఊడేసి కప్పెట్టినా ఊరుకోవు. ఆఁ! ఈరోజు పరీక్షా ఫలితాలు వస్తాయట! నాన్నగారికి పేపరు వచ్చిందేమో చూడు!

చెం : (హేళనగా నవ్వి) నా యింటపటారంగాను నాన్న గారికి పెళ్ళెందుకమ్మా ?

తార : నీతలకాయ్! పరీక్షా ఫలితాలంటే పెళ్ళేంటావ్.
పేపరు తే!

చెం : పేడె దుకండి?

తార : ఛ...ఛ...ఛ! పేడకాదు పేపరు.

చెం : ఆహా! తెమ్మంతారా? ఎందుకండి?

తార : గరల్సుస్కూలు పరీక్షా ఫలితాలు వస్తాయి.

చెం : గైరమ్మ సంభర మంతారా? ఎక్కడా?

తార : అబ్బబ్బా! చంపకే వెళ్ళు లోపలికి.

చెం : యెల్లమంతారా! నాయింట పటాకంగాను చెప్పేరు. గాదేం! (లోనికి వెళ్తాడు వెళ్ళేచెంచయ్యను తార చూచి నవ్వుకుంటుంది. కుటుంబరావు పేపరు పట్టుకుని వస్తాడు.)

కుటు : అమ్మా! తారా - తారా!

తార : (లాలనగా) ఏం నాన్నా!

కుటు : మొన్న నీవు పరీక్షలు వ్రాసావుగా! నీనెంబరెంతమ్మ!

తార : (ఆత్రుతగా) ఏం నాన్నా! పరీక్షఫలితాలొచ్చాయా?

కుటు : ముందు నెంబరు చెప్పమ్మా!

తార : 3366 నాన్నా!

కుటు : (పేపరు చూస్తూ) ముప్పై మూడు అరవై ఆరు (నసుగుతాడు)

తార : త్వరగా చెప్పు నాన్నా! నాకు భయంగావుంది.

కుటు : (పేపరు టేబిల్ మీదపెట్టి) పరీక్షలు బాగా వ్రాస్తే భయమెందుకమ్మా?

తార : బాగా వాస్తేమాత్రం భయముండ దేంటి? త్వరగా చెప్పు నాన్నా !

కుటు : (నవ్వుతూ) నా చిన్నారి చిట్టితల్లి ప్యాసవుతాదని ఏనాడో కలలు కన్నాను.

తార : (ఆనందంగా) ఆఁ! నేను ప్యాసయ్యానా నాన్నా ?

కుటు : అవునమ్మా! యింకా సందేహ మెందుకు ? యిదిగో నీవే చూడు! (యివ్వబోతాడు.)

తార : అక్కరలేదు నాన్నా! నీవు చెప్పితే చాలు. నాన్నా! (వినయంగా ఏదో చెప్పాలనుకొని ఆగిపోతుంది )

కుటు : చెప్పమ్మా.

తార : అదికాదు నాన్నా? నేను పరీక్ష పాసయితే వెంకట రమణమూర్తికి రెండుకొబ్బరికాయలు కొట్టుకుంటా నని దండం పెట్టుకున్నాను నాన్నా.

కుటు : ఓస్ ! యింతే కదటమ్మా! రెండు కాక రెండు వందలు కొట్టు తల్లీ! నీకు ఏం కొరత ?

శంకరం: (సిగరెట్టు కాల్చుకుంటూ నవ్వుతూ ప్రవేశించి) రెండూ సబ్జెక్టుల్లు వదలేసి రెండు వందల కొబ్బరి కాయలుకొట్టి – 'నీదే భారం భగవంతుడా! అంటే ఆ భగవంతుడు మాత్రం ఏం చేస్తాడు మామయ్యా?

కుటు : అదేమిటోయ్ శంకరం! నీవూ ఎప్పుడూ తారంటే తమాషాగా మాట్లాడతావ్? అవునులే! కాకి కండ్లెప్పుడు ఎర్రటి దొండపండుమీదే వుంటా యుటగా......

శంక : చాల్లే మావయ్యా! నీవెప్పుడు చూచినా మీ రాగాల తారనే పొగడుతుంటావ్!

కోటు : లేకపోతే వరుసగా ఫోర్తు ఫారం ఫోర్ టైమ్సు దండయాత్రలు కొట్టి దండిగా తిని నిండుగా సూటు వేసుకొని తిరిగే నిన్ను పొగడలేదనా నీకోపం.

శంక : పాపం! మీకా శ్రమ అక్కర లేదులే మావయ్యా

తార : (సంతోషంగా) బావా! నేను పరీక్షలో..........

శంక : (ఆమె మాటలకు అడ్డు తగిలి) తప్పకుండా తప్పు తావులే

కోటు : తప్ప లేదోయ్ ప్యాసయింది.

శంక : (తుళ్ళిపడి) చచ్చాం! అ...యిం...ది...?

తార : యిదిగో! పేపరు చూసుకో బావా! నాన్నా! వుండండి. మీకు కాఫీ తీసుకువస్తాను. (సంతోషంగా గెంతుతూ లోనికి పరుగెడుతుంది.)

శంక : (వినయంగా) మావయ్యా! తార నింకా చదివిస్తారా, యిక మన ఊరిలో తార చదివే చదువు లేదుగా మానిపించేద్దాం.

కోటు : పట్నం పంపుదామోయ్.

శంక : (తుళ్ళిపడి) చచ్చాం! పట్నమే? (లేచి రెండడుగులు వేసి తనలో) యిప్పటికే నాకంటే రెండు క్లాసులు ఎక్కువయింది. S. S. L. C. ఎలాగ పోయి మన డిగ్రీకి దగ్గరవుతుందని నేను ఎక్సపెట్ చేసుకుంటే యిప్పుడు పాసయి కూర్చుంది. యిక పట్నం వెళ్ళితే ఆ ఫేషన్‌లో మనవాసనే చూడదేమో? (ప్రకాశముగా) మావయ్యా!

కుటు : ఏమయ్యా ?

శంక : (కొద్దిగా సిగ్గుపడుతూ) మరి మా పెండ్లి సంగతో ?

కుటు : అది అమ్మాయినే అడుగు. అమ్మాయి కిష్టమైతే నిన్నూ ప్రేమిస్తే......

శంక : (నవ్వుతూ) ప్రేమా? అది నాకు కొట్టిన పిండే మావయ్యా.

కుటు : నీపిండి అక్కడ వుడకొద్దటోయ్.

శంక : మావయ్యా నీ ముద్దుల మేనల్లుని, నా ముచ్చట తీర్చటం విధి కాదా?

కుటు : నీవనేది సమంజసమే ననుకో, అదీకాక అమ్మాయిని కూడాంఅడిగి చూడడము అనేది కూడ బాధ్యత వున్నది. అయినా అమ్మాయి చిన్నపిల్ల కాదోయ్! ఉన్నత భావాలుకల చదువుకున్న పిల్లాయే! అందు

లోను ఆమె మాట తోసిపుచ్చకుండా వుంచుతానని వాళ్ళ అమ్మకి మాట యిచ్చినామె! యింతకీ యీమాట లెందుకు అమ్మాయినే అడిగి చూద్దాం.

శంక : అదేమిటి మావయ్యా! తార నీ వేదైనా కాదంటే ఆమాట కలలో కూడా చేయుదుకదా? అయినా అమె విశాల భావాలు నాకు తెలియవనా! సరే అడిగి చూడండి.

తార : (లోపలినుండి కాఫీ కప్పులతో ప్రవేశించి) ఏమిటి నాన్నా అడిగి చూద్దాం అంటున్నారు?

కుటు : ఆఁ! ఏముందమ్మా మీ బావ నీపెళ్లి ప్రస్తావన తేస్తే నిన్ను కూడా అడగాలనుకుంటున్నాము. నీకు తెలియని విషయ మేముందమ్మా. నేనా పెద్దవాడ నయ్యానాయే. నాకు కొన్ని బాధ్యతలు అనేవి వున్నాయికాదా! అమ్మా! ఆడపిల్లలుగల తండ్రి కేమి కోరిక లుండేవి నీకు వేరే చెప్పాలా? నీ వా నాకు కొడుకువైనా కూతురువైనా నీ ఒకర్తవే కాదా అమ్మా. (కన్నీళ్ళు తెచ్చుకుంటాడు.)

శంక : ఆమాత్రం దానికే విచారిస్తున్నా రెందుకు మావయ్యా. చెట్టంత మేనల్లుడుని నీచేతిలో అండ దండగా చేరి నీవు చెప్పినట్లు నడుచుకుంటూ అన్ని

వేళలా మన జమీాని జాగ్రత్తగా చూచుకుంటూ తారను కూడా నాకంటిలో కనుపాపలా కాపాడు కొనేవాడను. మీాకు నేను వుండగా మీాకు దిగు లెందుకంటూ. ఆc! ఏం తారా! అలా అని మీానాన్నకు కాస్త ధైర్యం చెప్పు ఎందుకంటే యిప్పుడు కాకపోయినా యింకో యేడాదికైనా మన యిరువురం యేకం కాకపోతామా అంట. ఆహా! ఏమంటావ్ తారా?

తార : కావచ్చు. కాని, బావా! పిల్లలు పెరిగి పెద్దవాళ్ళు అయినంత మాత్రాన పెళ్ళిళ్ళకొరకు ప్రయత్నాలు చేయుటమేనా మీా బాధ్యత! ఆడపిల్లలు జన్మించి నంత మాత్రాన ఈనవనాగరికత ప్రపంచంలో స్త్రీకి వంట యింటి జీవితమేనా మీావుద్దేశం? అది గాక, బావా! స్త్రీ కూడా మానవ స్త్రీయే కాని ఒక వింత జంతువుకాదు. స్త్రీకి కూడా కొన్ని అభి రుచులు, స్వాతంత్ర భావాలు అనేవి వుంటాయి. అంతేకాని 'స్త్రీ' పురుషుని చేతిలో కీలుబొమ్మమాత్రం కాదు. స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యములుగల వక్తి అని ప్రజలు తెలుసుకోలేక పోతున్నారు. యేది యేమైనా, బావా! యిప్పటిలో నేను మారేజి

స్వతంత్ర భావాలు, స్వతంత్రభావాలు, నాలుగు ఎంగిలి ముక్కలు అంగుళ్ళ కందినంత మాత్రాన అనవలసిన మాటలేనా? చూస్తాను! మీ విశాల భావాలు. ఈ తండ్రికూతుళ్ళ త్రైశిక్కలకు తప్పట్లు కొట్టే తాతయ్యగా తలుస్తున్నారు. కాబోలు! నేను యీనాడే వీరి అపరభావాల్ని అరికట్టడానికి నాంది ప్రారంభిస్తాను. అదును దొరికినప్పుడే మన కత్తికి పదును పెట్టాలి. ఈనాటినుండి ఈతండ్రికూతుళ్ళను, ఈ జమీనీ ఈ నా చేతిలో కీలు బొమ్మలుగా చేసి వీళ్ళందరినీ శంకరగిరి మన్యాలు పట్టించకపోతే నాపేరు శంకరమే కాదు. (సిగరెట్ పడేసి కోపంగా వెళ్తాడు.)

( అ వ ని క జా రు ను. )

# రక్తపాశం

## 3 వ రంగం

( 3 కుర్చీలు స్టేజిపై ఉండవలయును. )

[ అది చంద్రం నివసించే గది. అందులో ఒక మూలగా ఒక టేబుల్. రెండు కుర్చీలు వుంటాయి. ఆ టేబుల్ మీద కొన్ని పుస్తకాలు వుంటాయి. టేబుల్ ముందున్న కుర్చీలో చంద్రంకూర్చుని తదేక దీక్షతో పుస్తకం చదువుతూ వుంటాడు. తార పుస్తకాలు పట్టుకొని ప్రవేశిస్తుంది. ]

తార : గుడ్ మార్నింగండి.

చం : వెరీ గుడ్ మార్నింగు. రండి కూర్చోండి. (కుర్చీ చూపిస్తూ) ఏమిటిలా వచ్చారు?

తార : అబ్బే ఏమిలేదండి, మొన్న కాలేజీ వార్షికోత్స వాలులో అన్నిటిలోనూ ప్రధమ బహుమతులు సంపాదించారుగా అందుకనీ......

చం : ఆఁ! అందుకనీ......

తార : కంగ్రేజులేషన్ చెప్పి పోదామని వచ్చానండి.

చం : థాంక్సు చాలా సంతోషము. ఆఁ! అన్నట్లుమీకు ఆటా - పాటా అంటే చాలా యిష్టమనుకుంటాను,

తార : అవునండీ. వినడం యిష్టయేకాని పాడటం కష్టం. (ఇద్దరూ నవ్వుకుంటారు.)

చం : మీరు బలేవారండి,

తార : అంటే.

చం : లేకపోతే ఏంటండి? పాటలు వ్రాస్తారు. పాడతారు.

తార : మీకంటేనా? ఆఁ! మనవార్షికోత్సవాల్లో పాడిన

పాటలు ఎలాగున్నాయండి ?

చం : అని అడుగుతున్నారా? (చిన్నగానవ్వి) ఎలాగుంటే ఫస్టుప్రైజు వస్తుందో అలాగే వున్నాయి అందుకేగా ఫస్టుప్రైజు పొందారు.

తార : అబ్బా! చాల్లెద్దురు మీపొగడ్తా!

చం : ఏమండీ! మిమ్మల్ని ఒక్క విషయం అడగాలని వుంది. మన్నిస్తారా?

తార : అదే అడగాలని అనుకుంటున్నాను.

చం : అయితే చెప్పండి.

తార : తమరు ఇంకా పెండ్లి చేసుకోరాయనీ......

చం : (చిన్నగానవ్వుతూ) ఓఁ అదా! పేదవాళ్ళ పెళ్ళికేం తొందర్లెండి?

తార : చాల్లెండి మీమాటలు, అయితే మీరు చెప్పేదేటండి ?

చం : మీరు తప్పక మన్నిస్తానంటే.

తార : మీరడగాలికానీ మీకోరకు సర్వం సమర్పించుకుంటాను.

చం : (కంగారుపడి) అబ్బే! అదేం కాదండి! మొన్న కాలేజీలో పాడినపాట మరొకసారి వినే అదృష్టం కలుగ జేయమని అర్థిస్తున్నాను.

తార : (నిట్టూర్పు విడిచి) ఓఁ అదా! (తన్మయత్వ చెంది ఓరచూపు చూస్తూ) తప్పకుండా పాడతాను.

వలచినానురా !.........

పిచినానురా !.........

సరాగాలతో - నన్ను సరసనుజేరరా! ...వలచి
వన్నెల చిన్నెల - వలపుల రాజా!
కన్నులు వలసె - వెన్నెల రాజా!
కదలిరావా - నీవు
కలువకన్య - నేను
సరాగాలతో - నన్ను సరసనుజేరరా! ...వలచి
పున్నమి వెన్నెల - కలువల రాజా!
నిన్నే వలచెను - ఈ తెల్లని రోజా!
కదలిరావా - నీవు
కలువకన్య - నేను
సరాగాలతో - నన్ను సరసనుజేరరా! ...వలచి
(తార పాట పాడుతూ నృత్యాన్ని అభినయిస్తూ చంద్రం కాళ్ళదగ్గర వ్రాలుతుంది.)

చం : వెరీగుడ్! చాలా బాగుంది (గుటకలు మ్రింగుతూ) ఆనాడులేని ఆనందాన్ని యీనాడు కలిగించారు.

తార: (క్రీగంటి చూపులలో) అంతేకాదు; అమితానంద డోలికల్లో ఉయ్యాలలూగుతూ పసిడి పానుపులపై పవళించి పరవళ్లు త్రొక్కే రోజులు రానున్నాయిగా. (సిగ్గుగా నెమ్మదిగా లేచి పైట సద్దుకొంటూ కుర్చీలో కూర్చుంటుంది)

చం : (చిరునవ్వు నవ్వి తడబడుతూ) అది సరేగాని ఎక్కడ నుంచి రాక? పుస్తకాలతో బయలుదేరారు.

తార: అదా! మన క్లాసుమేటు సరోజ ఇంటికెళ్ళి వస్తున్నానండి శేఖర్ గారేరండి?

చం: వాడు ఎప్పుడూ రూములో వుండడుగా, ఊళ్ళోకెళ్లాడు. (వాచీ చూసి) వచ్చే టైం అయింది.

తార: అయితే మీ రెప్పుడూ రూములోనే ఉంటారన్న మాట. (ఇద్దరూ నవ్వుకుంటారు. జడ అల్లుకుంటూ ప్రేమగా తడబడుతూ) మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలండీ! ఏమంటారు? (ఓర చూపు చూస్తుంది)

చం: (తడబడుతూ) ఏంటది?

తార: (లేచి సిగ్గుపడుతూ) ఇప్పుడెందుకు లెండి. వస్తా! నమస్కరించి వెళ్ళుతుంది. చంద్రం తార వెళ్ళే వైపు చూస్తూ చిరునవ్వు నవ్వుకుని పుస్తకం చూస్తుంటాడు)

శేఖ: (ప్రవేశించి) హల్లో! గుడ్ మార్నింగ్ చంద్రం!

చం: (నవ్వుతూ) గుడ్ మార్నింగ్ శేఖర్! ఏమిటి విశేషాలు?

శేఖ: విశేషాలు కేం కొదవరా. చాలా వున్నాయ్. కాదు గాని, నీ వెప్పుడు పుస్తకాల పురుగువై చదువుతూ వుంటా వేమిట్రా.

చం : పెద్దవాళ్ళు ఎద్దులా కష్టపడి చెమటూడ్చి సర్వ శక్తులు ధారపోసి వాళ్ళు తినో, తినకో మనము ఏదో కష్టపడి చదువుకున్నామనే నమ్మకంతో కలలుకంటూ నెలలు తరబడి డబ్బు పంపిస్తుంటే యిక్కడ మనం అనేక దురభ్యాసాలకు లోనై దరితప్పి గురిదాటలేక కూరుకొంపోవాలిరా.

శేఖ : ఏమిట్రా చంద్రం. క్లాసులోనే ఎప్పుడు ఫస్టు వస్తున్నావనుకుంటుంటే ఉపోద్ఘాతాల్లో కూడా బెస్టుగా ఫస్టు వస్తావనడానికి సందేహం లేదురా! అందుకే ఆ తార ఈ చంద్రుని కోసం తహతహ లాడుతుందిరా.

చం : ఎవరాయి ఆ తార ?

శేఖ : ఎవరా? ఇదిగో! కవరువిప్పి చదువుకో.

చం : ఫ్రమ్ అడ్రసు ఏమిట్రా?

శేఖ : యింకేమిటి ? తార! బియ్యే. కేరాఫ్ రావు బహదూర్ కుటుంబరావుగారు శ్రీపురం.

చం : (కంగారుపడుతూ) ఆఁ! తార నాకే దుకుఇస్తుందిరా? నాకు కాదేమో.

శేఖ : (నవ్వుతూ) నీకు కాకపోతే నాకనుకున్నావేమిట్రా? తార దారిలో కనిపించి నీకీయుమని నాకిచ్చింది. కవరు విప్పి లెటర్ చదువుకో. ఎవరికైందీ నీకే తెలుస్తుంది (కవరు ఇస్తాడు)

చం : (కవరు తీసుకొనక) చింపి అదేమిటో నీవే చదువు,

శేఖ : (కవరుచింపి)

"ప్రియాతి ప్రియమైన చంద్రానికి ప్రేయసి తార తహతహ లాడుతూ వ్రాసుకుంటున్నా లేఖ— మీ పేరు తలుస్తుంటే నా హృదయం ఆనందంతో వికసిస్తుంది. అలలుగా నాట్యం చేస్తుంది. మీరూపు కంటే నా కనుచూపుల్లో చంద్రుని చూచిన తెల్ల కలువలవలె విప్పారి ఉప్పొంగుచున్నది. చంద్రా, నిన్ను నామనసారా ప్రేమించాను. అట్టి పవిత్ర ప్రేమను అపవిత్రం చేయకుండా నా ఆశ నిలబెట్టే భారం నీ కోమల హృదయంలో వున్నదని నమ్ముచున్నాను. పువ్వు వికసించగానే మంచి పరిమళాన్ని వెదజల్లుతుంది. అందలి మకరందంకోసం తుమ్మెదలు ఎంత ఆతురతతో తిరుగుతాయో! యిప్పటికైనా ఊహించారా? ఈ అశాంతి జీవికి శాస్త ప్రశాంతాన్ని చేకూరుస్తావని - ఆశతో నా ఆశ నిరాశ చేయవనే నమ్మకంతో వ్రాస్తున్నాను. ఇట్లు మీ దర్శనార్థం వేగిరపడే మీముద్దుల ప్రేయసి తార

చం ; (పడన్‌గా కుర్చీనుండి లేచి) పట్టి స్సితారా,

శేఖ : (చేయి పట్టుకొని) కూర్చోరా మిష్టర్! అలాగంటావ్ శ్రీపురం జమీందారుగారి ఏకైక గారాల పుత్రిక.

మధుర మంజుల జవ్వని, నవ యౌవ్వన సుంద రాంగి అయిన ఆ తార నీవే చంద్రుడవని దాసోహం చేస్తూ ప్రేమభిక్ష పెట్టమని కాళ్ళమీద పడి ప్రాధేయ పడుతుంటే తార 'సితారా - పంచదారా అంటూ ఏకధారగా గోలపెడతా వేట్రా.

చం : లేకపోతే ఏమిట్రా! మన పెద్దలు పెట్టే హిందూమత సాంప్రదాయాలను మట్టిపాలుచేసి హద్దుమీరి సంచరిస్తున్నారా! ఈకాలము ఆడవాళ్ళు ఒక పెద్దా చిన్నా అనే యోచనా జ్ఞానము యిసుమంతైనా లేకుండగా ప్రేమలేఖ, ప్రేమరాయభారాలు చేస్తారు.

శేఖ : ఒరేయ్! ఏమిట్రా నీలెక్చర్! గంటన్నర ప్రీచ్చర్ గా దంచేస్తున్నావ్! కావాలని ఆడది కాళ్ళమీద పడి ప్రేమభిక్ష పెట్టమని అర్థిస్తుంటే కాదని కాళ్ళదన్నే వాడవు నీఒక్కడివే ఈ కలికాలంలో నాకంటికి కనుపిస్తున్నావురా.

చం : కాకపోతే ఏమిట్రా! యిలాగ వ్రాయటంలో ఉద్దేశం ఏమైయుంటుందిరా ?

శేఖ : ఏముందిరా! వాళ్ళు మొట్ట మొదటినుంచి వేసు కున్నా ప్లానురా జమీందారుకు మంచియోగ్యుడు. చదువుకున్నవాడు, జమీందారు అయి వున్న అంద గాడు తన కూతురుకు భర్తకావాలని. యిక తార

అంటావా; తనకూ సహృదయం కలవాడు తనకు నచ్చినవాడు, తండ్రి మెచ్చినవాడు, తమ స్టేటస్‌కు తగ్గవాడు అయివుండాలని కోరిక కలది. ఈ గుణాలు నీలో వున్నాయిరా! అందుచేత ఆ అమ్మాయి నిన్ను లైక్ చేస్తుందిరా.

చం : కావచ్చు. అమ్మాయిలు లైక్ చేస్తునంత మాత్రాన పెండ్లిచేసుకోవటమేనా? యిదేనా ప్రయోజకత్వం! చిన్నప్పటినుంచి పెంచి పెద్ద చేసిన పెద్దవాళ్ళు అన్నిటికన్నా ఆదరించి సేవతీర్చే అన్నయ్యా వుండగా మనము ఈ పెండ్లి విషయము వినరాదు... అనరాదు...

శేఖ : (నవ్వుతూ) కనరాదు అంతేనా? యింకా వుందా! ఒరే, బాగా ఆలోచించుకో, పున్నమినాడు చంద్రుని చుట్టు ఆ తారలే లేకపోతే ఆ చంద్రుని కాంతి కేవలం విశ్రాంతేరా! నిన్ను వలచి వలపించే ఆమెతో కలసిరారా.

చం : ఆ! ఆ! తలచి తలచి అలసిపోయేవుగాని (తెర లోనికి చూచి) ఆ వచ్చేదెవర్రా,

శేఖ : (పరకాయించి నవ్వుతూ) యింకెవరు? మన తార గారి బంటు, ఆ చెవిటి చెంచయ్యే.

చం : వాడా! చెముడంటావేమిటి? నత్తికూడాను.

మీదఅంసనాలేసి కంచాలమీద క...క ... కనిక
రించడు బాబూ! క...క ... కమ్మగా భోజనంచేసి
వచ్చినాను.

శేఖ : (చెవిదగ్గరకు వెళ్ళి గట్టిగా) ఓ కంచాల చెంచయ్యా తిన్నావుగాని వున్నవిషయం చెప్పరా బాబూ చంపక !

చెం : అ...అ...అమ్మాయిగారు పంపగానే వచ్చానండి.

చం : (నవ్వుతాడు)

శేఖ : (హేళనగా) ఎవరు పంపగా వచ్చారండీ ?

చెం : ఎ...ఎ... ఎవరేటండి మాగారాలతార మాటాడకుండగా ఆరా దీసుకురమ్మంటే వచ్చానండి

శేఖ : (బిగ్గరగా) ఏమిటోయ్! ఆరా అనిజారామంటున్నావు మాటలు ! ఏమిటి? ఎవ్వరిగురించి ?

చెం : యి...యి...యింకెవరిగురించి ? చె...చె...చంద్రం బాబుగారిగురించేనండీ !

చం : (ఆశ్చర్యంగా) అఁ! నాగురించా ?

చెం : సి...సి...సిత్తం.

చం : యేమిటో! మీచిన్నమ్మగారికి ఈ పేదవాడితో పరిచయ మెందుకో తెలుసుకోవచ్చునా ?

చెం : ఏ...ఏ...ఏటి? పరేచక మాడుతున్నా నంతారా మీారు మా బలేటోరే; అమ్మాయిగార్కి అమ్మ చి...చి...చిన్నప్పుడే పొయింది. అ...య్యగారికి అమ్మాయిగోరు తప్ప సంతానంఏది? అందుకని అయ్యగారు ఆత్తంతా అమ్మాయిగారికి వే...వేర్ని రాసేసినారు.

శేఖ : (గట్టిగా) ఓ చెవిటి చెంచయ్యా! మమ్మల్ని చంపక చెప్పవయ్యా బాబూ ఆస్తి కాదు, అసలు విషయం చెప్పరా తండ్రి!

చెం : ఆఁ! అదా! అ...ఆ...అమ్మాయిగోరు సాయంత్రం చ...చ...చల్లగాలికి పి...పి...పిల్ల కాలువగట్టున మామిడితోపులోనికి రమ్మని మ......మరీ...మరీ చెప్పమన్నారు.

శేఖ : (చంద్రిం భుజంతట్టి) విన్నావురా! నేను లెటరు తెస్తే నన్ను నవ్వులు పాలుచేశావు. యిప్పుడు ఏంచేస్తావు?

చం : అదే నేను ఆలోచిస్తున్నాను.

శేఖ : (నవ్వుతూ) ఆలోచన కేముందిరా! నిండుపున్నమిలో నీలి మేఘాలలో నిగనిగలాడే తారా చంద్రుల దోబూచు లాడుకొనునట్లుగా......

చం : (చిరుకోపంతో) ఎవ్రరా?

శేఖ : ఎవరా! నిత్యం నీ నీడలో మేడలు కట్టుకొని నీ తను వులో మనవు చేసుకొని నీ కొరకు కోటి దేవుళ్ళకు

మొక్కుచూ మామిడి తోపులో మాటేసుకొని
మనసారా ఆరాధించే అందాలరాశి తారేలేరా!

చం : ఒకేయ్! ఆగరా - ఆగు. కొంచెం గుక్క త్రిప్పుకొని మరీ మాట్లాడు.

శేఖ : అవున్లేరా నేనేమి చెప్పినా నీకు వేళాకోళమే!

చెం : ఏం, ఏంటి ఇయ్యాల తప్పకుండా వత్తానని సెప్ప మంతారా! సి...సి...సిత్రం! అలాగే సెప్పుతాను లెండి. (నమస్కరించి వెళ్ళిపోతాడు చంద్రం, శేఖర్ నవ్వుకుంటారు)

చం : ఓరి వీడి దుంప తెగ!, వీడితో మా బలే చావొచ్చి పడిందిరా! మనంఅనేదొకటి, వాడుఆలకించేదిమరొకటి

శేఖ : వాడు ఆలకించడం మాటకేంగాని, నీ వాలోచించిం దేంట్రా బాబూ? మీ యిద్దరిమధ్య సర్దుబాటు చేయటానికి నా పెద్దలు దిగివస్తున్నారు. 'కరవ మంటే కప్పకుకోపం - విడవమంటే పాముకుకోపం!' మరి ఇంకేలాగు ఈకోపతాపాలు మాపు మాపడమో నా కర్థం కావటం లేదు.

చం : నీ అర్థాలు అనర్థాలకు దారితీస్తాయని మరచిమాట్లాడు తున్నారా శేఖర్.

శేఖ : (ఆశ్చర్యంగా) అంటే నీ వనేది?

చం : నే నన్నదానిలో ఆశ్చర్య మేముందిరా. 'సలువ రాతి మేడలకూ - సన్యాసుల మఠాలకు పోలికా?' తార తాహతెక్కడా? మన తాహతెక్కడా?

శేఖ : ఒరోయ్! చంద్రం నీవు నిజంగా పాప భూయిష్టమైన ఈమానవ ప్రపంచంలో పుట్టవలసినవాడవు కావురా తప్పజారి ముప్పై తేవటానికి గొప్పగా శ్రీసూరయ్య కడుపున పుట్టావు. నీ బి. ఏ. నీ మెట్ట వేదాంతం కట్టిపెట్టి నీ మనస్సులోవున్న భావా లేంటో చెప్పరా అంటే మొట్టమొదటికే వస్తావేంరా? నీవు చదివిన బి. ఏ. చదువంతా కొయ్యబారి పోయిందేమిరా? (చంద్రం - శేఖర్ మాట్లాడుకొనుచుండగా బయట నుండి సూర్యం వచ్చి వాళ్ళు చెప్పుకునే మాటలు ఒక మూలనుండి వింటుంటాడు. సూర్యాన్ని వాళ్ళు చూడరు)

చం : డియర్ శేఖర్! పట్టాలు పుచ్చుకున్నంతమాత్రాన పట్నాల్లో పట్టపగ్గాల్లేకుండా ప్రతీవారినీ పల్టీకొట్టించి సిరికోసం స్త్రీల శీలాన్ని పాడుచేయుటమేగా మన పరమార్థం?

శేఖ : ఆహా! నిదురపోయె నీతిని మేలుకొలిపి పదిల పరచ టానికి అపర విదుర నీతి దురంధరుడవు బయలు దేరావురా! యిక నీతిని గోతిలో పాతిపెట్టి వెళ్ళు. కళ్ళు కాయలు కాచేటట్లు నీకొరకు కలవరింతలతో ఎదురుచూసే కన్యను కనికరించి రారా! ఆమె పెదవుల అంచులపై తొణికిసలాడి చిందులుత్రొక్కే

చిరునవ్వును చిత్రహింస చేయకు. ఆమె శ్రీపురం జమీందారిణీ ఆమె యావత్తు నీవేయని నిన్ను తన మదిలో పదిలపరచుకుంది. 'సిరిరా మోకాలడ్డు' అన్నట్లు నీవీ విధంగా మాట్లాడుతున్నావంటే అది నాకర్మ!

చం : అదేమిటిరా! మధ్య నీ కర్మము టూన్నావు?

శేఖ : (కుర్చీలోనుంచి లేచి యాక్షన్‌తో) మరేమిట్రా? వున్నట్లుండి అనుకోకుండా నా ఆప్తమిత్రుడు వింతగా యింతవుతాడని ఆశిస్తుంటే నాఆశను పంతంతో అంతం చేస్తున్నావుగదరా!

చం : (గంభీరంగా) మిష్టర్ శేఖర్! నేను ఎప్పుడు ఇతరుల ఆస్తులపై ఆధారపడలేదు. ఏదో ఉద్యోగం చేసుకొని నాలుగురాళ్ళు సంపాదించి పెద్దల మాటలకు హద్దు దాటకుండా బుద్ధిగా బ్రతకాలనే ఆశిస్తున్నాను.

శేఖ : (లేని నవ్వు తెచ్చుకుని) ఒరే చంద్రం! ఈనాడిలా చెప్పే ప్రబుద్ధులే రేపు జవరాళ్ళు వస్తే జీతంరాళ్ళు కాదు. ఇంటి యిటుకరాళ్ళతోసహా వాళ్ళ పాదాల దగ్గరపోస్తూ సర్వం సమర్పించుకుంటార్రా!

చం : శేఖర్! నీవు నామంచినే యెంచి చూడాలికాని కంచులా మ్రోగకూడదురా!

శేఖ : నేను మ్రోగలేదు వాగలేదు కాని నీలో దాగివున్న అంతరార్థాన్ని యదార్ధంగా చెప్పటానికి యింత జడుస్తావేమిరా!

చం : నేను చెప్పవలసింది-కనువిప్పవలసింది చాలావుంది రా చెప్తాను విను. నేను పుట్టిన అయిదవ యేటనే నా మాతృమూర్తి యిహంచాలించి అన్నయ్యను నన్ను దిక్కుమాలిన పక్షుల్లా వదలి పరలోకం పయనించింది. 'కన్నతల్లి ప్రేమ ఘనమైన ప్రేమ - కడమలన్నీ కష్టాలపాలవు' నన్నట్టుగా అనాటినుండి ఈనాటివరకు నేను నా తల్లి ప్రేమానుభూతికి నోచుకోలేకపోయాను (కన్నీళ్లు తుడుచుకొని) కన్నతల్లి కరువైనా కనురెప్పల్లో దాచుకొని నన్ను నిరంతరం కాపాడుతూ నన్నింతవానిగా చేసాడు మానాన్న. మా నాన్నకు మేమిద్దరమే సంతానం. మా అన్నయ్య నాకు అండగా నిలచి తను బండచాకిరిచేసి కండలను కరగించి రక్తం చెమటఏరుల్లామా రేవిధంగా మండుటెండల్లో శ్రమించి నన్ను యింతవానిగా చేశాడు. (దుఃఖాన్ని ఆపుకొని) శేఖర్! నిజంగా నాతండ్రీ - అన్నల ఋణాలు యీ జన్మలో తీర్చుకోలేను. నేసీ జీవితంలో నిర్ణయించుకున్నవి రెండే ఆశయాలు. ఒకటి తండ్రిని సుఖపెట్టాలి. రెండు నాఅన్న ఆశయాలు నెరవేర్చాలి. అనుక్షణం ఆక్షణం కొరకే ఎదురుచూస్తున్నాను. నాఅన్న ఆశయాలకు అనర్థం కలిగించకూడదు శేఖర్ అనర్ధం కలిగించకూడదు.

శేఖ : (నిశ్చేష్టుడై) మిస్టర్ చంద్రం! మీ అన్న ఆశయానికి

అనర్థం కలిగించటం నా ఆశయం కాదు. ఎప్పుడూ మీ అన్న అడుగుజాడలను అనుసరిస్తూనే వున్నావు అలాగే అందరికన్నా అధికంగా పరీక్షలు చాలా బాగా వ్రాసావు. ఈ వేళో రేపో పరీక్షా ఫలితాలు వస్తాయి. పరీక్షలో ఫస్టుక్లాసులో పాసవుతావని నాకు పూర్తి నమ్మకంవుంది. ఇక మీ అన్నతో చెప్పయినా సరే ఈ వివాహం వింతగా జరిపించే భారంనాది. ఇక నీవేమీ అభ్యంతరం కలిగించకూడదు.

చం : సీతో గొప్ప గొడవవచ్చి పడిందిరా! వాళ్ళకి మనకి ఎలా పొత్తు కుదురుతుంది? కారులమీద కాలేజీకి వెళ్ళేవారు వాళ్ళు ఆ కారు దుమ్ములో కాలిబాటపై కదలిపోయేవాళ్ళం మనం. యింటిలో నౌకరు, వీధిలో నౌకరు, కాలేజీకి వెళ్ళే కారులో నౌకరు వారికి; వారికేం కొదవ? యిక మనమూ అటువంటి నౌకరీలు దొరకక నానాయాతనలు పడుతున్నాం. ప్రపంచములో అన్నిటికన్నా అతిముఖ్యమైనది ధనం. ఆధనం ఇంట్లో దాగుడు మూతలాడుతూ దాసోహం చేస్తుంది ఆ ధనం వారి కండ్లయెదుట అందెలుకట్టుకొని బిందెలలో చిందులు త్రొక్కుతూ నాట్యం చేస్తుంది. మనలాంటివాళ్లు అష్టకష్టాలుపడి అహోరాత్రులు రెక్కలాడించినా డొక్క నిండదు సరిగదా మనం దరిద్రులం గనుక మనింటిలో ఆ ధనం దాచినా దాగకుండా

పరుగులెత్తి ఆగకుండా ఆ ధనవంతుల ఖజానాల్లోనే మూలుగుతా నంటుంది. (నిట్టూర్చి) శేఖరం! మన బాధలు ఈ ధనికులు ఏనాటికి తీర్చలేరు. అటువంటి ధనికులతో మనలాంటి దరిద్రులు వియ్యమందటం వివేక మేనా?

చంద్రం: నీ కెంత అమాయకుడవురా! నిజంగా నీవు ఆదికాలంలో అవతరించవలసిన అమాయకుడవురా! యింటివద్ద డొనేషనులు వసూలుచేసి చదువులకోసం కాలేజీలకు పంపగా కాలరు సర్దుకుంటూ కారులపై కాలం దొర్లించుకు పోయేవారి ఆస్తిపాస్తులు, నిజ స్వరూపాలు యిక్కడెవరిక్కావాలిరా? ప్రస్తుత పరిస్థితులలో కాలేజీలో చదువుకునే ప్రతీవాడు ఒక జమీందారే. అందులో మన మొకళ్ళం. అదీకాక నీ వినయ విధేయతకి, చదువు సంస్కారానికి, నీ వేష భాషలకు, నీ పరసనాలిటికి నేను చెప్పిన మాటల ప్రకారం ప్రతీవారూ నిన్ను ఒక పెద్ద జమీందారుగానే జమకట్టారు! ప్రస్తుతం మన కాలేజీలో జమీందారులలో కెల్లా పెద్ద జమీందారువు నీవే. ఇప్పుడు మనం యేమనుకున్నా లాభంలేదు. (కుర్చీ నుండి లేచి రెండడుగులు అటూ నిటూ పచార్లుచేసి కుర్చీపై ఒక కాలుపెట్టి తల గోక్కుంటూ) అయినా ఈ పరిస్థితులలో ఒక వెయ్యి రూపాయలూ, ఒక

నౌకరూ వుంటే మన ప్లాను చాలావరకు రక్తికట్టి వుండేదిరా. (నవ్వుతూ) సరే! ఎలాగైనా ఆలోచించ వచ్చునులే.

చం : ఏమిట్రా ఆనవ్వు? చెప్పరాబాబూ (శేఖర్ చెప్ప కుండా వీధిగుమ్మంవైపు రెండడుగులు నడుస్తాడు చంద్రం కుర్చీనుండి లేచి అతన్ని అనుసరిస్తాడు. అంత వరకూ వారిమాటలు వింటూన్న సూర్యం వారికి అను మానం కలగకుండా అప్పుడే వస్తున్నట్లు చేత్తో పేపరు పట్టుకొని లోనికి వస్తాడు. అతన్ని చంద్రం చూచి ఆశ్చర్యంగా) ఆఁ అన్నయ్యా!

సూ : (సంతోషంగా) తమ్ముడూ యెంత చిక్కిపోయావు? ఈ కొలత మెతుకులు నీవెలా తింటున్నావ్!

చం : (ఆనందంతో) లేదన్నయ్యా. నే నెప్పుడూ ఒకలాగే వున్నాను ఇంటివద్ద నాన్న బాగున్నారా అన్నయ్యా?

సూ : బాగానే యున్నాడు. మన రామన్నా, లచ్చన్నా కూడా బాగానే యున్నారు. నిన్ను చూడడానికి వెళ్ళలేదని నిన్న రామన్న తిండే మానేసాడు. తిరిగి వచ్చేటప్పుడు చంద్రాన్ని తీసుకురాకుండా వచ్చావో జాగ్రత్తని వాడి కొమ్ములతో కాడి జాడించాడు మన లచ్చన్న. చూడు తమ్ముడూ నాకన్నా నీవంటేనే వాళ్ళకి ప్రేమ.

పేపర్లు అమ్మే కుర్రాడు - బి. ఏ. పరీక్షా ఫలితాలని అరుస్తూంటే విని కొన్నానంతే.

శేఖ, చం } (ఆశ్చర్యంగా) ఆఁ! పరీక్ష ఫలితాలా?

చం : ఏదన్నయ్యా! నేను చూడనీయ్. (పేపరు అందుకో బోతాడు)

శేఖ : (కంగారుగా) వుండ్రా! నేను చూడనీయ్. (పేపరు అందుకుని వరుసగా చూస్తూ) ఒరే! నెంబర్లు నాకు కనబడటంలేదురా. (గాబరాపడుతూ వణుకుతాడు)

చం : భయపడకురా! పాసవుతావులే! (పేపరు తీసుకుని నెంబర్లు చూస్తూ) ఒరే! నీ నెంబరు 11601 కదూ?

శేఖ : (కంగారుగా) ఆఁ, ఆఁ, అవునురా. ఏం వుందా? లేదా? త్వరగా చెప్పరా చంపక

చం : (సంతోషంగా) ఓ. కే. నీవు పాసయ్యావ్, గ్రేట్ కంగ్రాట్యులేషన్ మిష్టర్ శేఖర్.

శేఖ : (అమితానందంతో చంద్రాన్ని కౌగలించుకొని థ్యాంక్యూ. ప్యాసయానుకదరా! ప్యాసయాను నేను ప్యాసయాను. ఆఁ! నీ నెంబరు చూడు 11602.

చం : (దిగులుగా పేపరు వెదుకుతూ) నానెంబ రింతవరకూ కనిపించలేదురా! నాపరీక్ష పోయినట్లేరా.

సూ : (త్రుళ్ళిపడి) తమ్ముడూ! (ఉద్రేకంగా అరుస్తాడు)

చం : (దిగులుగా తల వాల్చుకుంటాడు.)

సూ : (విచారంగా) తమ్ముడూ! నా ఆశలన్నీ నిరాశలై పోయాయా? తమ్ముడూ! నేను కట్టుకున్న కలలన్నీ కరిగిపోయాయా?

శేఖ : (చంద్రం చేతిలో పేపరు తీసుకొని చూస్తూ) మీరు ఏమీ దిగులు పడకండి. చంద్రం పరీక్ష తప్పితే ఆల్ కాలేజీ అంతా పరీక్ష తప్పి పప్పులో కాలేసి నట్లే నాలాంటి మట్టిబుర్ర ప్యాసవగా లేంది చంద్రం లాంటి గట్టిబుర్ర ప్యాసవ లేదంటే ఎవరు నమ్ముతారు (పేపరు చూస్తుంటాడు. చంద్రం తన చేతులపై తల వాల్చి వంచిన తలయెత్తి శేఖరు చేతిలోని పేపరు వైపు చూస్తూనే వుంటాడు. సూర్యం వెర్రిగా చంద్రంవంక – శేఖరు చేతిలోనున్న పేపరువంక చూస్తుంటాడు) సెకండుక్లాసు లాస్ (నిరాశగా) చంద్రం, కనుపించటం లేదురా! (మరల పేపరు అటూ – నిటూ త్రిప్పుతూ) ఒరేయ్! నీది 11602 కదూ

చం : (ఆత్రుతగా) అవునురా

శేఖ : (పేపరు టేబుల్ పై పెట్టి నవ్వుతూ విజిల్ వేస్తూ చేతి లోని తాళాలచేతుల గొలుసు త్రిప్పుతూ) నీ నెంబరు దొరికిందిరా! ఫస్టుక్లాసు రా.

సూ : (ఆనందంతో చంద్రాన్ని కౌగలించుకొని ఎత్తి గిర గిర త్రిప్పుచూ) తమ్ముడూ! నువ్వు ప్యాసయావు నువ్వు ప్యాసవుతావని నాకేనాడో తెలుసు తమ్ముడూ

ప్యాసవతేతంటే నాగుండె జల్లుమంది. ఆహాఁ! నా తమ్ముడు ప్యాసవకపోతే మరి పేసయ్యేవాడెవడున్నాడండీ శేఖర్ గారు,

శేఖ : దట్స్ రైట్! అంతేనండి అంతే.

చం : (సంతోషంతో) అన్నయ్యా! నాన్న కిప్పుడే ఈవార్త వుత్తరం వ్రాస్తాను.

సూ : ఉత్తరం ఎందుకు తమ్ముడూ! నేను ఇప్పుడే వెళ్ళి స్వయంగా నాన్నతో చెప్పుతానులే.

చం : అదేవిటన్నయ్యా! వచ్చి గంటైనా కానిదే అప్పుడే వెళ్తానంటావ్? రెండు రోజులుండి వెళ్దువుగాని

సూ : (నవ్వుతూ) రెండురోజులేంటి తమ్ముడూ! నేను యిక్కడే వుంటానులే. ప్రస్తుతం యింటికి వెళ్ళి నేను చేయవలసిన పని చాలా వుంది. ఆఁ! అన్నట్టు తమ్ముడూ! (ఏదో చెప్పబోతూ) ఎందుకులే.

చం : ఏమిటి చెప్పన్నయ్యా.

శేఖ : సందేహ మెందుకు చెప్పదలచుకున్న దేదో నిర్భయంగా చెప్పేయండి.

సూ : (ఇద్దరివంక చూస్తూ నవ్వుతూ) యిప్పుడెందుకులెండి చెప్పవలసింది. చేయవ సి ది ముఁదు ముందు చాలా వుంది. (లేచి చేతిసంచిలోవున్న అరటిపండ్లు తీసి చంద్రానికిచ్చి వెళ్ళబోతాడు, చంద్రం లేచి టేబుల్ మీద పెడతాడు)

శేఖ : (లేస్తూ) చూడండి (సూర్యం ఆగి శేఖర్ వైపు చూస్తాడు) మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి,

సూ : నాతో మీరేమి మాట్లాడ నవసరం లేదులెండి. మీరు చేసేదంతా నాకు ముందే తెలుసు. ఇక మీ యిష్టం. మీ స్నేహితులకి టీపార్టీలే చేస్తారో, డిన్నరే చేస్తారో చేయవలసిన ఏర్పాట్లన్నీ చేయండి. ఆఁ! చూడు తమ్ముడూ! నేను తిరిగి మళ్ళీ ఇక్కడకు మళ్ళా వచ్చేలోగా నీవు నీకు ఈడూజోడూ కలసిన, నీ మనసుకే నచ్చిన, పలువురు మెచ్చేలాంటి అమ్మాయిని ఎన్నుకొని నాన్నకి చిన్నకోడల్ని చూడాలి సుమా! ఆ, ఆఁ ఇక నేను వెళ్తాను (నవ్వుతూ బయటకు వెళ్తాడు. చంద్రం సిగ్గుగా తలవాల్చి చిరునవ్వు నవ్వుతుంటాడు)

శేఖ : (చంద్రం భుజంతట్టి నవ్వుతూ) చంద్రం! అదృష్టవంతుడివిరా! ఆప్యాయంతో చూసే అన్నా అన్ని విధాల ఆస్తిపాస్తులకు అందచందాలకు, అనురాగానందాలకు, అనుకూలమైన భార్య! నీ అన్న అభిప్రాయాన్ని తెలుసుకున్నావుగా? యికనైనా ఈ నిర్భాగ్యుని భారాన్ని బదిలీచేసుకోనీయ్! కోరి వచ్చిన కోమలాంగి కోరిక మన్నించు! యిక నేను వెళ్ళిరానా?

చం : ఎక్కడికి?

శేఖ : యింకా ఫ్రెండ్సు ఎవరెవరు ప్యాసయారో తెలుసుకోవాలిగా! మన తారా - తారాబలం ఎలావుందో తెలుసుకోవాలి ఈ వారం!

చం : అంటే?

శేఖ : పరీక్షా ఫలితాలు వచ్చాయిగదరా!

చం : ఫలించే వుండొచ్చు?

శేఖ : సరే! నేను వెళ్ళి యీ డిగ్రీతో ఏగ్రీడ్ కూడా చెప్పి కంగ్రాట్యులేషన్ కట్టుకు వస్తాను. బై. బై. (వెళ్ళబోతాడు.)

చం : యిదిగో శేఖర్ చూడు! (ఏదో చెప్పబోతాడు)

శేఖ : (ఆగి) ఏమిటది?

చం : ఆc! ఏమీ లేదులే! ఏమన్నా నీతో గొప్ప గొడవగానే వుంది. ఆc! యిక అల్లరిమాని మెల్లగా వెళ్ళి చల్లగా రా! (నవ్వుతాడు.)

శేఖ : ఏమిటి తాతగారికి తమ సందేశం?

చం : (నవ్వుతూ) ఉన్నావుగా, ఉపదేశకుడవ్"!

శేఖ : చిత్తం అయితే వస్తా! (వంగి నమస్కరించి వెళ్ళిపోతాడు. చంద్రం తనలో తాను నవ్వుకుంటాడు.

[ తెర ]

# రక్తపాశం

## 4 వ రంగం

(జమీందారు కుటుంబరావుగారి భవనం. రంగాలంకరణ అంతా రెండవ రంగం మాదిరిగానే వుంటుంది. శంకరం సిగరెట్టు వెలిగించి పేపరు చదువుతూ వుంటాడు. నౌకరు చెంచయ్య అప్పుడే సంచితో వచ్చి ముఖాన్ని పేపరు అడ్డు పెట్టుకొని చదువుతున్న శంకరాన్ని జమీందారుకుటుంబరావు అనుకొని చేతిలో సంచి ప్రక్క కుర్చీలో పెట్టి నమస్కరించి)

చెం : (నవ్వుతూ) న...న...నమస్కారం బాబయ్యా, అమ్మాయిగోరు పే...పేసయ్యిపోయినారు.

శంక : (మొఖానికి అడ్డుగావున్న పేపరుతీసి టేబుల్ పై పెట్టి (ఆశ్చర్యంగా) ఆఁ!

చెం : (మాటివిరిచి సంచి చేత్తో పట్టుకొని) ఆఁ! మీరా? పె... పె ... పెద్దయ్యగోరనుకుని ఈ చల్లని కబురు మెల్లగా మీతో సెప్పినాను. ఎంతపొ...పొరపాటయి పోనాది?

శంక : (కోపంగా) పొరపాటు కాదురా! మీకు పట్టిన గ్రహపాటును వదిలిస్తాను. నన్ను కాదని ఎలా తప్పించుకుంటారో చూస్తాను. (సిగరెట్టు నేలను వేసి కొట్టి యిసురుగా లోనికి వెళ్తాడు.)

చెం : (వెళ్లే శంకరాన్ని మిర్రుగా చూస్తూ) ఈయనేటి సూత్తారో నాను చూత్తాను. గె...గెహపాటని గే.., గే—గేలి చేత్తున్నాడు, ప...పనిపాటు నేకుండా

స...సాపాటు రాముడులా కూకుని బోడిపెత్తనంచేసే యీాయనేటి చేత్తాడో నాను సూత్తాను. (లోపలకు వెళ్ళబోతాడు. అంతలో చలపతి వస్తాడు)

చల : ఏమిట్రోయ్ చెంచయ్యా చూస్తానంటున్నావ్ ?

చెం : ఏ...ఏటి సూ...సూత్తానన్నానా? ఉఁ! దానికేగాని పె...పెద్దయ్యగోరేడబోయారు ?

చల : దొడ్లో స్నానం చేస్తున్నారు.

చెం : ఏ...ఏం! ఎడ్లు కొంటానికి సంతకెల్లానంటారా ; ఎ...ఎ...ఎప్పుడూ ?

చల : (గట్టిగా) ఓరి చెవిటి సన్యాసీ! సంతకు కాదురా, స్నానం చేస్తున్నారు.

చెం : (హేళనగా) చచ్చె ? ఊరికోవయ్యా! సన్యాసివని శ...శకుని పక్షిలా మాట్లాడుతావు. పరుల మెప్పు కోసం తప్పుడు లెక్కలు వ్రాస్తే సన్నాసోడు సన్యాసము పుచ్చుకుని స...సన్నాసం వ్యాలికాని, బో... బోళ్ళంత స...స...సంసారం. పి ... పిల్లాజెల్లాతో యేడ్చేవోడ్ని నానెందుకు సన్నాసి నవుతాను? అయ్యగార్ని అన్నాయంచేసి ఆ...ఆయన ఆ తంతా కట్టబెట్టాలని సూత్తాన్నారు గావోసు శంకరంగోరూ మీారూనూ జాగర్త !

చల ; (కోపంతో) ఒళ్ళు దగ్గరపెట్టుకొని మాట్లాడు. నోటికి వచ్చినట్లు వాగకు జాగ్రత్త ?

చెం : ఏ...ఏటీ ? తాగుడా! ఇక్కడెవడు తాగేడంటారు ? తూత్తేది. తా...తాగుడంటే నాకసలేగిట్టదు. నువ్వ

తాగుతావ్. మీా...మీాశంకరంగోరు తాగుతారు. అంతేగాని నన్ను తాగేనంతా రేంఖర్మం? ఔన్లే! ప...పచ్చకామెర్లరోగికి పెపెంచకమంతా పచ్చగానే కనిపిత్తాదంట, నిజమేలే!

చల : (ఉద్రేకంగా) నీనెత్తి నిజం! ఎక్కువ తక్కువ లేకుండగా నోటికి వచ్చినట్లు వాగకూ అంటే మేం తాగుబోతులమంటూ వేమిరా? ఏంపొగరెక్కిందా? చిన్నయ్యగారితో చెప్పానంటే నీవు, నీ ఉద్యోగం ఊడుతుంది. అప్పుడుగాని అణగదు నీ పొగరు.

చెం : ఆ! అంతగట్టిగా గంతులెయ్యకండి. చ...చలపతిగారూ! అన్యాయాలు, అక్రమాలు చేసి చక్రవడ్డీలు వేసి పేదపెజల్ని పీడించుకుంటూ అప్పు తీర్చలేదని యిల్లు పీకుతాను. ప...పంట ఏలంపాట ఏత్తాను. పుట్టిమీాద కుండలు ఒట్టికిపోతాను, అని మీాబె...బెదిరించే అ...అమాయకులైన ఆళ్ళదగ్గర, అంతేగాని, నా ఉద్యోగం పీకించేతానంతావ్ నీకేం రోగం? కానీ ఒకటిమాత్రంమరచిపోకండి. మ...నూ...నూరు గొడ్డుల్ని తిన్న రాబందునికి ఒక్కటే గాలిపెట్టు అంతారు జాగ్రత్త.

చల : పూటకి గతిలేనివాడు కోట గడతానని పెద్ద చెప్పాచ్చాడట నిలాంటోడే!

శంక : (సిగరెట్టు కాల్చుకుంటూ లోపలనుండి వచ్చి) ఏమిటి చలపతి మీ యిద్దరి ధ్వనులు యిల్లంతా ప్రతి ధ్వనిస్తూన్నాయ్ !

చల : (చెంచయ్యను చూపుతూ) అల్లడుగో చూడండి ఆ చెవిటి ముండాకొడుకు నోటికి వచ్చినట్లు ప్రేలుతున్నాడు.

శంక : (చలపతి వైపు కనుసైగచేసి) ఏమిటి చలపతీ ! మంచీ చెడ్డా లేకుండా తరతరాలనుండి ఈ యింటికి యిలవేల్పుగా-వంశపారంపార్యముగా నౌకరీచేస్తున్న మా చెంచయ్యనే నోటికి వచ్చినట్లల్లా తిడుతున్నావ్ జాగ్రత్త! ఈరోజు మొదలుకొని ఈ చెంచయ్యనేమైనా అన్నావో చూడు ! (చెంచయ్యను చూస్తూ వినయంగా) ఆః! చెంచయ్యా ! ఇక్కడ గొడవకేంగాని అయ్యగారు నిన్ను పిలుస్తున్నారు. నీవు వెళ్ళు.

చెం : చిత్తం ! (నోట్లో ఏదో నసుగుకుంటూ లోనికి వెళ్లాడు)

చల : (ననుమానంగా చూస్తూ) ఏమండీ ! మీరు కూడా నన్ను...

శంక : (నవ్వుతూ) హా ! హా ! హా ! మిష్టర్ చలపతీ ! నాకు దళపతిగా వుంటూకూడా యింత అలపతివని ఎన్నడూ తలపలేదయ్యా ! యిదిగో చూడూ (రహస్యంగా చెప్పినట్లు భుజం తట్టి) ప్రస్తుతం మనం తారకు వీడే రధసారధి అందుకే వీడిని మన చేతికి చిక్కించుకొని

చల : మరి చెప్పేరు కాదేం? ఎల్లెల్లా? ఎంతసేపండీ! ఎల్లుండి ఈ వేళప్పటికి వెతికితేనూ? ఆఁ! అన్నట్లు మీరు 'ఊఁ!' అనాలేకాని ఎల్లుండిదాకా ఎందుకు? ఈ రోజే ఆజానుబాహుడులాంటి అల్లుడు మామ గిత్తల్ని తీసుకురానూ!

శంక : (ఆశ్చర్యంగా) నేను ఊఁ అనడమేంటి? కావాలని కండ్లెదుటే చెప్పుతుంటేను. ఎక్కడున్నా - ఎంత డబ్బు అయినా సరే తెప్పించవయ్యా.

చల : డబ్బు యిచ్చి పుచ్చుకో నవసరం లేదండి యిచ్చిన డబ్బుకే పుచ్చుకోవచ్చు.

శంక : (ఆశ్చర్యంగా) ఇచ్చిన డబ్బుకి పుచ్చుకోవటమా? ఎక్కడ? ఎలా? ఎవరి దగ్గర?

చల : ఎక్కడో, ఎవరి దగ్గరో ఎందుకండి! మన రైతు సూరయ్య లేడూ......

శంక : ఆఁ! ఆఁ! సూరయ్య వున్నాడు.

చల : సూరయ్య మనకు బాకీవున్న సంగతి మీకు తెలుసుగా!

శంక : ఆఁ! బాకీ వున్నాడు.

చల : ఆఁ? సూరయ్య పెద్దకొడుకు పొగరపోతు సూర్యంగా డున్నాడు మీకు తెలుసునుగా!

శంక : ఆఁ! ఆఁ! సూర్యంగాడా? వున్నాడు. తెలుసు.

చల : కర్మ, తెలుసూ? వాడు వట్టి పొగరబోతే కాదండడి పల్లెల్లో నవిపాట్లులేని పదిమందిని ప్రోగుచేసి పల్లె

ప్రజల్ని ఉద్ధరించడానికి యువజన సంఘం, ఆవకాయ సంఘం, బీరకాయ సంఘం, యిలాంటి రకరకాల సొరకాయల సంఘాలు లేవదీసి నానా అల్లర్లు సాగిస్తున్న గట్టి పిండమండీ వాడు!

శంక : సంఘంలో నాయకుడా? లేక ఈ సంఘాల పేరుతో అంగుడి వరకూ మింగెడి వినాయకుడా? ఏమిటి ఈ సంఘ సంస్కరణ? ఈయన యువజన సంఘాల్ని లేవదీసి సంసారుల్ని సానుల్నిగానూ, సానుల్ని సంసారులుగా మారుస్తానన్నాడా ఏమిటీ కర్మం!

చల : అదేగదా! ఈ పంచాయితీ పెద్దలకు లేని దురద వాడికెందుకంటా? ప్రతీరోజు మీాటింగు పెట్టి ధనికుల దౌర్జన్యాలు నశించాలి. ప్రభుత్వమిచ్చే పారిశ్రామిక హక్కులన్ని కాపాడుకోవాలని, ప్రతీపల్లెలో స్వయం కృషితో రోడ్డులు రోడ్డుల కిరుపక్కల కాలువలు, కాలువల కిరుప్రక్కల మురికి నీటికుండీలు ఏర్పరచుకోవాలని, ప్రజల కష్ట నష్టములలో ఆదుకోవాలని, మనిషిని మనిషిగా గుర్తించి మనిషియొక్క విలువ తెలుసుకోవాలని — అబ్బ! ఒకటేమిటి; బల్లగుద్ది గొంతు చించుకొని ఊకదంపుగా దంచేస్తుంటేనూ!

శంక : (సిగరెట్టు కాలుస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూ) అయితే ఈ యువజన సంఘాలు ముందు ముందు మనకే మూలమన్నమాట?

చల : అన్నమాటేమిటి? ఉన్నమాట - ఔనన్న మాట కూడా అదేనండీ? మనం చూస్తూ చూస్తూ వూరు ఉంటే నెత్తిమీద సుత్తితో మోదేటట్లున్నారు కూటికి గతిలేని కూలి వెధవలంతా వీడితో కూడి యువజన సంఘం, వాళ్ళ తలకాయ సంఘం అంటూ నడివీధిలో బడి దొర్లుతూ నోటికి వచ్చినట్లు మనల్ని దూషిస్తూ కేరింతలు కొడుతుంటే చూస్తూ వూరుకోవడమా. మరోవిషయం సమిష్టి వ్యవసాయం సాగిస్తారట.

శంక : మేమిటి నువ్వు చెప్పేది? మ్రింగటానికి మెతుకులు లేవుగాని మీసాలకు సంపెంగనూనె అడిగాడన్నట్లు పూటకు గతిలేనివాడు పేటను ఎలా పోషిస్తాడు? లేకపోతే దొంగతనాలకో, దారిదోపిడీలకో బయలుదేరాలి, అంతేనంటావా చలపతి?

చల : మరి యింకేంతండీ! చూశాను మొన్న జమీందారు జయరాంగారి జొన్నచేను కోతకి రండిరా అంటే కట్టడి కట్టారు గదండీ ఈ యువజన సంఘంవాళ్ళు!

శంక : ఎందుకు?

చల : ఎందుకేమిటండీ! అందుకే, ఏది చూశారు? కూలి ఎక్కువ చెయ్యమని వాళ్ళగోల.

శంక : అందుకు జయరామ్‌గారేమన్నారూ?

చల : ఏమంటారు? చచ్చినట్లు ఒప్పుకొని కూలి రేటు ఎక్కువ చేసి కోయించుకొన్నారు.

శంక : ఆఁ! ఇంతవరకూ వచ్చిందీ ? అయితే ఇక మన మీదకూడా ఈవిధంగానే తిరగబడతారన్నమాట.

చల : (పరధ్యానంగా) తప్పకుండగాను ! (పొరబడినట్లు నాలుక కరుచుకొని) కాదు, అలా తిరగబడతారన్న మాటే నిజమైతే తింటారు మన మర తుపాకీమందు

(యిద్దరూ కలసి ఒక్క సారిగా నవ్వుకుంటారు.)

శంక : సరే! సూర్యంగాడి గొడవ తరువాత చూడవచ్చును గాని ముందు మన యెడ్ల సంగతేమిటి ?

చల : యేమిటంటా రేమిటి ? నేను చెప్పేది అదే. చెప్ప బోయేది అదేగదా !

శంక : యేమిటది ?

చల ; అదేనండి ! మన సూర్యంగాడి దగ్గర మన చుట్టుపట్ల పేరు మోసిన జోడు ఎడ్లు కాడిమోస్తున్నాయి.

శంక : (ఆతృతగా) ఆఁ ! సూర్యంగాడిదగ్గరే ?

చల : ఔనండీ ! వాటికి రామన్నా - లచ్చన్నా అని పేర్లు కూడా పెట్టుకున్నాడు. వాడు ఈసంవత్సరము వాళ్ళ యువజన సంఘం తరఫున మన యెడ్ల పందెంలో పాల్గొంటాడట. వాటి ముందు మొనదేరి పేరు మోసిన ఒంగోలు గిత్తలు కూడా బలాదూర్.

శంక : (ఆశ్చర్యంగా) ఆఁ ! అలాగా ? (కాస్త ఆలోచించి) అలా అయితే వాడిదగ్గర గిత్తలు మనమేకొంటే ?

చల : అదే నేను అనేది. కానీ వాడు అమ్మవద్దూ!

శంక : వాడు అమ్మనట మేమిటోయ్! మనమే అమ్మిస్తాం.

చల : (నవ్వుతూ) అలా అన్నారు బావుంది.

శంక : చూడు! వాళ్ళు మనకీయవలసిన బాకీ ఎంతుందో?

చల : ఎంత అయితే ఎందుకులెండి. మీ మామయ్యగారు వాళ్ళని బాకీ అడగవద్దంటేనూ!

శంక : ఈ విషయం మావయ్యదాకా ఎందుకోయ్! అన్ని విషయాలు మనమె చూసుకోవాలిగాని!

చం : అలా అన్నారు బావుంది. అయితే యిక చూడండి! ఈ చందరాడ చలపతి యేంచేస్తాడో!

శంక : ఇతకీ బాకీ ఎంత?

చం : చక్రవడ్డీ ప్రకారం రెండువేలకు పైచిల్లరే వుంటుంది. మొన్న బాకీ వసూలు చేయమన్నప్పుడు వాళ్ళు యిల్లు తనఖా వ్రాయించి పుచ్చుకున్నాను. దాని మీద దావాచేస్తే దగ్గరకొస్తారు. అప్పుడు దేముడో అటూ న్యాయంగా వొప్పుకొని యెడ్లని వాళ్ళే యిస్తారు లేదా ఆ యెడ్లపైనే జపు పెట్టి మనమే పాడుకోవచ్చు దానితో రోగం కుదురుతుంది.

శంక : (నవ్వుతూ) భేష్! బావుంది నీ ఐడియా! (సిగరెట్టు వెలిగిస్తాడు. ఇంతలో వీధిగుమ్మంనుండి సూర్యం ప్రవేశిస్తాడు.)

సూ : నమస్కారమండీ.

శంక : నమస్కారం. ఓ! సూర్యం! నీవా? రా! రా! కూర్చో! దట్సకరెక్టు. చలపతీ! నీవు చెప్పినట్లు

సూర్యానికి నూరేళ్ళు ఆయుస్సు. సూర్యం! నీవు నిజంగా నూరేళ్ళు బ్రతుకుతావోయ్! యిప్పుడే నీయొక్క మంచితనము గురించి ఊరంతా చెప్పు కుంటున్నారని మా చలపతి చెప్తున్నాడు అంతి లోనే నీవు వచ్చావు అన్నట్లు మాతమ్ముడు చంద్రం ఎక్కడుంటున్నాడు?

సూ : యేదో మీలాంటివారి దయవల్ల పట్నంలో చదువు కుంటూ మొన్ననే బి. య్యే. ఫస్టుక్లాసులో ప్యాస య్యాడు లెండి!

శంక : బి. య్యే. ప్యాసయ్యాడా? బోడి బి. య్యే, బోడి ముండలు ప్యాసవుతున్నారు ఈ రోజుల్లో! యింతకీ ఏదో పనిమీద వచ్చినట్టున్నావు యేమిటి సంగతి?

సూ : అబ్బే! యేం లేదండీ, పెద్దయ్యగార్ని కలుసుకొని యేదో కష్టసుఖాలు చెప్పుకుందామని వచ్చానండి.

చం : (తనలో) చచ్చేం. (తేరుకొని) అయ్యగారు నన్ను యిప్పుడే మీయింటికి వెళ్ళి బాకీ వసూలు చెయ్యమని చెప్పి లోనికి వెళ్లారు.

సూ : (ఆశ్చర్యంగా) ఆఁ! మా యింటికా?

చల : అవును. మీ యింటికే! (శంకరానికి కనుసైగను చేస్తాడు.)

శంక : అవునోయ్ సూర్యం! మీరేదో కొంచెం బాకీ వున్నట్లు చెప్పారు. ఏదో అవసరంవుందని అర్జెంటుగా

అడిగి తెమ్మన్నారు. (చలపతితో) ఆఁ! అన్నట్లు చలపతీ! నీవు వీళ్ళింటికి వెళ్ళనవసరంలేదు సూర్యమే మనింటి కొచ్చాడుగా! అన్ని విషయాలు మాట్లాడు. నేనిప్పుడే వస్తాను. (లోనికి వెళ్తాడు)

చల : విన్నావటోయ్ సూర్యం! చిన్నయ్యగారు అన్న మాటలు! ఇక నిదానంగా ఆలోచించి సమాధానం చెప్పు.

సూ : (నిట్టూర్పు విడిచి) చలపతిగారూ! చెప్పటాని కేముంది? మా బీదల బాధలు, మఱమల మాడే మండు టెండల్లో కండలు కరగించి బండచాకిరీచేసినా తినడానికి గంజికైనా చారెడు గింజలు దొరకని ఈ రోజుల్లో బస్తాలతో దోచుకున్నా ఇంకా బాకీలంటే ఎక్కడ తెచ్చి యివ్వగలం చెప్పండి?

చల : యిక ఆ కందిపప్పు కబుర్లేమి కుదరవు చచ్చినట్లు బాకీ యిచ్చి తీరవలసిందే! తప్పుతుందా మరి బాకీ తెచ్చుకున్నా తరువాత? యిదిగో చూడు సూర్యం! ఈ బాకీలన్నీ బర్తురఫ్ చేసే భారం నాది. కాని నీవు నాకొక సహాయం చేసిపెట్టాలి, యేమంటావ్?

సూ : చెప్పండి చలపతిగారూ! యేం చేయమన్నా సిద్ధంగానే వున్నాను.

చల : చేస్తానంటే నీకు కొంత డబ్బుకూడా ముట్టజెపుతాను

సూ : (ఆశ్చర్యంగా) డబ్బుకూడా యిస్తారా?

చల : తప్పకుండా!

సూ : అయితే చెప్పండి యేం చేయమంటారో ?

చల : ఆహా! మన అయ్యగారు పందాలంటే పడిచస్తున్నారనుకో !

సూ : కోడిపందాలా ? గుర్రప్పందాలా ?

చల : కాదు యెడ్ల పందాలు !

సూ : యెడ్లపందాలా ? యింకేం ? మిరిమిట్లు కొలుపిస్తాం !

చల : అదికాదోయ్ ! నేను చెప్పేది జాగ్రత్తగా విను!

సూ : యేమిటది ?

చల : ఏమీ లేదు ! అయ్యగారే యీ యేడు ఎడ్లపందాల్లో పాల్గొంటానంటున్నారు.

సూ : అయ్యగారా ! పందాల్లో పాల్గొంటున్నారా? (ఆశ్చర్యంగా) బలే, బలే, బలేవుంది. 'యథారాజా తథా ప్రజా!' అన్నట్లు అయ్యగారే స్వయంగా ఇంత ఉత్సాహంతో పందాల్లో పాల్గొంటుంటే యిక మా యువజన సంఘాలన్నీ ముందుకొచ్చి పోటీ పడతాయ్!

చల : (చిరునవ్వుతూ) అందుకే నీ సహాయం కావాలని అడుగుతున్నాం !

సూ : (నవ్వుతూ) సముద్రంలో కాకి రెట్ట అన్నట్లు అయ్యగార్కి నాలాంటివాడి సహాయ మెంతండీ! సరే నన్నేంచేయమంటారో చెప్పండి ?

చల : అదేనోయ్ ! (నసుగుతూ) యెడ్లు......

సూ : ఆ యెడ్లకి గడ్డికావాలా గోజుకి పాతిక మోపులు పైన కోసుకొచ్చి పారేత్తాను.

చల : యెడ్లకి గడ్డికాదోయ్! నీ యెడ్లే కావాలంటున్నారు.

సూ : (నిశ్చేష్టుడై బాధగా) చలపతిగారూ! ఏమిటి ఈ పన్నాగం? యిదంతా మీరే మాపై ఈర్షతో అయ్యగార్కి విషబుద్ధి నూరి పోస్తున్నారా? మీకు ఏం ద్రోహం చేసామని మమ్మల్ని ఇంత అన్యాయం చేయ జూస్తున్నారు? ఎందుకు మాపై మీకింతకక్ష

చల : లక్షరాల అయ్యగారు అడగమంటే అడిగాను. అంతేగాని నీపై కక్షబూని కయ్యానికి కాలు దువ్వాలని కాదు సూర్యం.

సూ : చలపతిగారూ! పొలం పండినా పండకపోయినా పొయ్యార్ప నవసరం లేకుండగా, పొరిగింటికి తెలియకుండగా పోషించుకొస్తున్నా నా రామ లక్ష్మణుల్ని నానుండి వేరుచేయకండి. మీకు పుణ్యముంటుంది ఈ అకలి పొట్ట చల్లార్చటానికి ఆ కాడెద్దులు, ఎకరం నేలైనా చల్లగా వుండనివ్వండి. అవికూడా లేకపోతే మాగతేంకాను ఆలోచించండి?

చల : యిదిగో! అబ్బాయి సూర్యం. నీవేదో ఆవేశంతో మాట్లాడుతున్నావు. అంతేకాని నేనన్న మాటలో మంచి చెడ్డ ఎంత వున్నదో ఆలోచించలేకపోయావ్ నీవేం పుణ్యానికి నీ యెడ్లను మాకిచ్చి నిమ్మ దొడ్లు తుడుచుకో మనటంలా? యేదో ఇంతని చెప్పి క్రియానికే విక్రయించమంటున్నాను.

సూ : (వినయంగా) ఏదో కల్లాకపటం యెరుగని తమచల్లని చూపు మామీద వున్నంతవరకు ఫరవాలేదండి,

కుటుం: ఆఁ! ఏమిటి కారణం యిలా వచ్చావు?

సూ : (నసుగుతూ) ఏమీ లేదండీ! మొన్న ఈ మధ్యనే వాడిని ఏదో కష్టపడి చదివించాను కదండి!

కుటుం: ఏమిటీ మీ తమ్ముడినా?

సూ : ఔనండీ!

కుటుం: ఎంతవరకూ చదివించావు?

సూ : మొన్నకదండీ బి. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు.

కుటుం: (ఆశ్చర్యంగా) మొన్న మొన్నటివరకు మీ బాబు కూడా బొందిలాగు తొడుక్కొని తోడొచ్చేవాడు. వాడేనా?

సూ : అవునండీ! ఏదో తినో తినకో చదివించుకుంటున్నా నండీ! దానికితోడు ప్రభుత్వంవారుకూడా స్కాలర్ షిప్పు యిప్పించారండి!

కుటుం: చాలా సంతోషం! చూడవోయ్ శంకరం! ఇట్టంత మనిషివుంటే మాత్రం ఏంలాభం? నీటుగా షూటు వేసుకొనితిరగ్గానే సరిపోయిందా? చదువూసంస్కారం కావాలి. ఏనాటికైనా ఆస్తినీ, అంతస్తుని పెంచేవి అవే. ఈనాడున్న ఆస్తులూ, అంతస్తులూ రేపు లేక పోవచ్చు. కాని నిత్యమూ నీడలా వుండేవి ఈ చదువూ సంస్కారమే ఈ విషయం ప్రతీవాళ్ళు గ్రహించాలి

ఆఁ! చూడు సూర్యం ఇంతకీ నీకేమికావాలో చెప్పావు కావు.

సూ : (వినయంగా చేతులు నలుపుతూ) మావాడు పట్నం నుండి పట్టా పుచ్చుకొని రావటానికి చేతిలో నయా పైసాకూడా లేదండి. పైగా ఉన్నయిల్లూ వాకిలీ...

చల : (తడబడుతూ) అవన్నీ ఎందుకులే! కలిసొచ్చే రోజుల్లో కష్టాలు చెప్పుకోపడం విన్నారుగా అయ్యగారు యిక......(తల గోక్కుంటాడు)

కుటుం: ఆఁ! ఆఁ! ఏంకావాలో చూచి పంపించవోయ్ శంకరం! నేనలా లోనికి వెళ్ళివస్తాను, రారా చెంచయ్యా! (వీధిలోకి వెళ్తాడు)

చెం : చిత్తం (గట్టిగా) మంచాలు కాదురా, కూడా రమ్మంటున్నారురా!

చెం : మ...మ...మరి చెప్పేరు కాదేం! నా...నా... యింటూపటూరంగానూ! (గబగబా వెళ్తాడు)

శంక: (సిగరెట్టు కాల్చుకొంటూ) సూర్యం! నిలబడే వున్నావేమిటి? మిష్టర్ చలపతీ! మన సూర్యం బాకీబాపతు ఏమాత్రముందో చూడు!

చల : ఏమాత్ర మేమిటండీ! మన బాకీపూర్తిగా లెక్కవేస్తే ఆ యిల్లూ వాకిలికూడా సరిపోతుందా?

సూ : (ఉద్రేకంతో గట్టిగా) చలపతిగారూ! ఏమిటి పన్నాగం? నేను యింటిదగ్గిర లేకుండగాజేసి ముసలాడిని భయపెట్టి బలవంతాన వేలుముద్ర వేయించుకున్నది

యిందుకేనా? అసలుకి వడ్డీలు, వడ్డీలకి వాటి వడ్డీలు, చక్రవడ్డీలు కట్టించి కడకు నా కొంపా గోడి యిలా కొనడానికేనా ఈ నాటక మాడుతున్నా? పళ్ళు కొరుకుతూ) చలపతిగారూ! మీరింత మేకవన్నె పులిగా మారుతున్నారని కలలో కూడా తలంచలేదు.

చల : బలేగుందోయ్ నీ వరుస! ఏదో కూతురు కనలేక కష్టపడుతుంటే అల్లుడిని పట్టుకు తన్నాడంట నీలాంటోడే! బాకీ యిచ్చింది వారు—పుచ్చుకున్నది నీవు! మధ్యన నాకెందుకంటా ఈతంటా?

శంక : ఇదిగో! చూడు సూర్యం! మాదగ్గర వుండే మొగ మాట కొద్ది మామయ్య మారు పలకకుండా వెళ్ళి పోయేరేగాని (ఒకపొడుగైన నోటులాంటి కాగితం కోటు జేబులోనుండి పైకితీసి) ఇదిగో! మీ బాకీ గురించి యావత్తు రికార్డు మాకప్పగించి తక్షణంగా వసూలు కొరకు దావా చేసి జప్తు అమలు జరపమని నీవొచ్చే ముందే చెప్పారు. ఇక నీవు ఏం చెప్పినా లాభంలేదు బాకీపూర్తిగా యిచ్చితీరవలసిందే

సూ : (విచారంగా) శంకరంగారూ! మీరిలా పీకమీద కూర్చుని ఒక్కసారిగా మమ్మల్ని ఒత్తిడిచేస్తే యేం లాభం చెప్పండి? పంటలు తక్కువ, పన్నులు ఎక్కువ. కష్టపడినా కడుపునిండని రోజుల్లో కదల

నీవుకుండగా బాకీలను బాధించడం మీకు న్యాయ
మేనా చెప్పండి ?

శంక : సూర్యం ! మేమేదో అన్నామని ఆడిపోసుకోవద్దు. నే చెప్పేది బాగా ఆలోచించుకొని వచ్చితే అలా చేయ్ ! మామయ్య మక్కువతీరా నీయెడ్లు కావా లని అడిగారు కనుకా బాకీ మాట యిప్పటికో వదలిపెట్టి నీకో వెయ్యిరూపాయ లిస్తాను. అదైనా మామయ్యకు తెలియకుండామాత్రం యెడ్లను తీసుకు వచ్చి అప్పగించు. ఎడ్లపందాలు అయిపోయినతర్వాత నీయెడ్లను నీవు తీసుకుపోయినా మాకు అభ్యంతరం లేదు.

సూ : (ఏమీ మాట్లాడకుండా మౌనంగా వుంటాడు.)

చల : ఆఁ! ఆఁ! అదే బాగుంది. అంతవరకూ కావాలంటే కిరాయికూడా !

శంక : ఆఁ! కిరాయెందుకోయ్ ! పరాయివాడు కాడుగా మన సూర్యం ?

చల : అవునవును. అదీ ఒక పాయింటే ! మీ ఉపాయం చాలా బాగుంది ఇదిగో సూర్యం ! మారుమాట్లాడక మీతమ్ముడికోసమైనా ఒప్పుకోవయ్యా ! యిచ్చింది పుచ్చుకొని వచ్చినదారినిపోయి నీతమ్ముడి జమీందా రులా ముస్తాబుచేసి పట్టునపట్టా పుచ్చుకొని మంచి ఉద్యోగము చేయించు. మళ్ళ వచ్చిన తరువాత నీ యెడ్లను నీవే తోలుకొని పోవచ్చునుగా !

సూ : (మాట్లాడకుండా ఆలోచిస్తూ వుంటాడు. అతనికి గతంలో చంద్ర-శేఖరం అనుకొన్నా మాటలుజ్ఞప్తికి వస్తాయి. (తెరలో శేఖర్ ఈ మాటలు మాట్లాడాలి) అయినా యీపరిస్థితుల్లో ఒక వెయ్యి కూపాయలూ- ఒక నౌకరూ కావాలి.

సూ : (ఆలోచనాయుతంగా తనలో) అవునా, నా తమ్ముడి ఆశలు నెరవేర్చాలి. అదే నాజీవిత ఆశయం! అందుకు ఎంతకైనా త్యాగంచేయాలి. (శంకరాన్ని ఉద్దేశించి) శంకరంబాబూ! రామలక్ష్మణులకువీలోటు లేకుండగా చూడండి! పోటీల అనంతరం తప్పక నా రామలక్ష్మణుల్ని నాకు ఒప్పచెప్పాలి!

శంక : చాలా సంతోషం! అలాగే చేస్తాను, నీవు కోరినట్లే యిస్తాను. (ఇంతలో బయటనుండి చెంచయ్యా కుటుంబరావు మాట్లాడుకుంటూ వస్తారు)

చెం : అ...అ...అవును బాబయ్యా! చ...చ...చంద్రం బాబుగో పె...పె...పెద్ద జమీందారునాగేవున్నా రండీ! అబ్బబ్బా! ఏ...ఏ...ఏమి అందం— ఏ...ఏ...ఏమి చంద్రం! అ...అ...అచ్చంగా ఆ చంద్రుడిలాగే వుంటారు బాబయ్యా!

కుటు : అలాగా (సూర్యాన్ని చూచి) ఏమిటోయ్ సూర్యం ఇక్కడే వున్నావు? చూడు శంకరం! అతనికేమి కావాలో చూచి త్వరగా పంపించు.

శంక : అలాగే మావయ్యా! రా సూర్యం రా! (లోనికి వెళ్తాడు. వెనుక సూర్యంకూడా వెళ్తాడు.)

కుటుం: (పేపరు తిరగేస్తూ) యింకా [illegible] చెంచయ్యా?

చెం : (మాట్లాడడు)

చల : (చెంచయ్య భుజంతట్టి గట్టిగా) నిన్నేనోయ్ సంగతు లేమిటోయ్ యని అయ్యగారు అడుగుతున్నారు.

చెం : (ఆమాట చెవిదగ్గర చెయ్యిపెట్టి ఆలకించి) చి...చి... చిత్తం! చిత్తం! ఆ...ఆ...అమ్మాయిగారు ఆ... అమ్మాయిగోరికి పు...పు...పూర్తిగా నచ్చిపోయా రండి! అ...అ...అబ్బాయిగారు కూడా పె...పెద్ద చదువే చ...చ...చదివేరంట!

కుటుం: (చిన్నగా నవ్వుతూ) విన్నావటోయ్ చలపతీ! మన అమ్మాయి స్వయంగా మనకష్టాల్ని పంచుకొని వరుడ్ని నిర్ణయించుకొంది. కాలాన్ని అనుసరించే ప్రజలు మారుతూ వుండాలిగామరి!

చల : (చిన్నగా నవ్వుతూ) చిత్తం! చిత్తం!

కుటుం: జాగు చేయకూడదు. త్వరగా పెండ్లి యేర్పాట్లు చేయించాలి! నా ముద్దుల కూతురు పెండ్లి ముచ్చటగా చూచి మరీ కండ్లు మూస్తాను.

చల : అయితే చెంచయ్యా! నీవెళ్ళి అమ్మాయిని (ఇంతలో సూర్యం శంకరం వస్తారు) ఆ చంద్రంగార్ని తీసుకురా

మేము ఈలోపుగా పెండ్లి యేర్పాట్లన్నీ చేస్తాం!
(చెంచయ్య వెళతాడు)

సూ : (చంద్రం పేరు వినేసరికి ఉలిక్కిపడతాడు. అందరూ తనవైపే చూస్తారు) ఏమిటి బాబూ! చంద్రంగారు అంటున్నారు?

కుటుం: (నవ్వుతూ) అదా! అని విన్నావటోయ్ శంకరం విషయం.

శంక : ఏ విషయం మావయ్యా?

కుటుం: చెప్పవోయ్ చలపతీ!

చల : అబ్బే! యేమీలేదండి! మన తారమ్మగారు తమకు ఈడూ జోడూ కుదిరిన అబ్బాయిగారిని తాడు కట్ట డానికి తనే స్వయంగా నిర్ణయించుకున్నారట.

శంక : అయితే తార తన పెండ్లికి ముందే ప్లాను తయారు చేసుకుందన్నమాట. (ఇంతలో లోపలనుంచి పోస్టు జవాన్ "సార్! పోస్టు!" అని కేక వేస్తాడు)

కుటుం: చూడు శంకరం! మనకు టపాలు ఏదో వచ్చి నట్లుంది.

శంక : అలాగే! (లోనికి వెళ్తాడు)

సూ : పెళ్ళి అంటున్నారు. ఎవరికండయ్యా?

కుటుం: యింకెవరికోయ్. మా అమ్మాయి తారకే.

సూ : (ఆనందంగా) అలాగా బాబయ్యా! చాలా సంతోష మండి! యింతకీ పెండ్లికొడుకు ఎవరు! మన శంకరం గారేనా?

కుటుం: ఆఁ! వారు మాత్రంకాదు వరుడ్ని అమ్మాయెన్ను కుంది. అబ్బాయి బి. య్యే. చదివేడంట. పెద్ద జమీం దారట. పేరు చంద్రమట.

సూ : (చంద్రంపేరు వినేసరికి మళ్ళీ బెదరి ఆత్రుతగా) అయితే తమ రేమన్నారు?

కుటుం: ఏమన్నారు! అమ్మాయి అన్నమాటకి ఎప్పుడు కాదన్నాను?

సూ : (తొట్రుపాటుతో బెదురుతూ) ఔనండి! ఔనండీ! అంతేనండి.

కుటుం: యేమిటోయ్! అలా లేడిలా బెదురుతున్నావ్.

సూ : (తేరుకొని) అబ్బే! ఏంలేదండీ. ఆడపిల్లల అంతరార్థం అమ్మలకేగాని, అయ్యలకు తెలియదంటారు గదా! అమ్మగారు పోయినప్పటినుండి తమరేగా తల్లయినా తండ్రైనా! అందుచేత తమరేమన్నారా అని? (చిరునవ్వు నవ్వుతాడు)

కుటుం: అనుమానం లేకుండా అంగీకరించాను. ఇంతకీ యిలా నేనీ పెండ్లిచేయటం నీకిష్టమేనా!

సూ : చాలాచాలా యిష్టమండీ! అన్నీ త్వరగా జరిపించెయ్యండి. నే వెళ్ళొస్తాను. తిరిగి అమ్మాయిగారి పెండ్లయిన తరువాతే కనిపిస్తాను.

కుటుం: అదేమిటోయ్ పెండ్లికిరావా!

సూ : అయ్యయ్యో ఎంతమాట. అమ్మాయిగారి పెండ్లి నా చేతిమీదనే గదండి జరిగేది. ఇక నేను వెళ్ళి వస్తానండీ. (నమస్కరించి బయటకు వెళ్ళిపోతాడు)

శంక : (కవరు తీసుకొని లోపలనుండి వచ్చి కోటుంబరావుకు యిస్తూ) మావయ్యా! పెళ్ళికి మేళతాళాలు ఏర్పాట్లు చేయమంటారా ?

చల : అబ్బబ్బ! మేళాలగోలకి తాళాల? ఎందుకండి వాళ్ళు? అంగుళం దళసరి రంగు పూసుకొని హంగు చేస్తుంటే డంగైపోయి దవడమీద కొట్టించుకోవటానికి చెంగట్టుకుని వెళ్ళేడుతారు మన పెద్దలు.

కోటుం: (చిన్నగా నవ్వుతాడు)

శంక : ఇదిగో చలపతీ! నీకు తెలియదుగాని ఈ రోజుల్లో పెండ్లికి మేళంపెడితే శుభలేఖలు ఖర్చే వుండదంటే నమ్ము.

చల : అంటే ?

శంక : పెళ్ళిపెద్దలు పిలవకుండగానే పోగుపడతారోయ్ !

చల : ఔనులెండి. ఆ మేళం సందడిలో ఈ పెండ్లిపెద్దలు బుద్ధులు మారి ముద్దులకోసం గ్రుద్దులాడుకుంటారే గాని పట్టున పట్టెడు అక్షింతలేసే తాతయ్యలుకూడా వుండరు. అయినా ఎందుకండి ఈ మేళాలకు మన తాళాలు. చూడండీ! ఈమధ్య అందరూ చెప్పుకుంటున్నారు. (ఈ గొడవ వినకుండగా కోటుంబరావు చేతిలోవున్న కవరు చించుకొని లోలోన నవ్వుకుంటాడు.)

వివాహానికి ఒప్పించగలిగాను. బావకు యీ విషయాన్ని జెప్పవలయును. బావా నేను చిన్నప్పటినుండి ఒక యింటిలో ఆడుకుంటూ, పాడుకుంటూ అవ్వాకపోయినా అన్నా చెల్లెలుగా పెరిగి పెద్దవారమయ్యాము. అంతేగాని ఈ విషయం మరేవిధంగానూ తలంచవద్దని చెప్పవలయును. మేము త్వరలో బయలుదేరి వస్తున్నాము. అక్కడికి వచ్చిన తర్వాత అన్ని విషయాలు వివరంగా మాట్లాడవచ్చు. ఇట్లు మీ గారాల తార"

కుటు : విన్నారుగా! యిక యేర్పాట్లన్నీ త్వరలో చేయించడం మంచిది. (లోనికి వెళ్ళబోతాడు)

శంక : (కోపంతో) మామయ్యా!

కుటు : (ఆగి సగం తిరిగి) ఏమయ్యా!

శంక : మీరిలా తప్పటడుగులు వేస్తే ముప్పు తప్పదు జాగ్రత్త!

కుటు : (కోపంతో) ఆఁ! ఏమిటీ నీ మాటలు?

శంక : (ఉద్రేకంగా) ఏం నామాటలు సూటిగా నీగుండెలో గునపాల్లా గ్రుచ్చుకుంటున్నాయా?

కుటు : (కోపంగా) నోర్మూయ్

శంక : ఎందుకుమూయ్యాటం ఇన్నాళ్ళనుండి మీకూతుర్నిచ్చి కులకబెడతానని ఆశచూపి ఈనాడిలా నన్ను నిరాశ చేసి మీ మనసు మార్చుకోవటానికి కారణమేమిటి?

కాటుం: (హేళనగా నవ్వుతూ) కారణమా? నీకు తారతో కారణం ప్రేమో గే యోగం లేక. (విసురుగా లోనికి వెళ్తాడు.)

శంక : (కాటుంబరావు వెళ్తున్న వైపు చూస్తూ కోపంగా) ఇన్ సల్ట్. చెపుతాను. నేనంటే వీళ్ళకి ఎంత అలక్ష్య ముగావుంది? వీళ్ళ వియ్యానికి కయ్యాన్ని, సంతోషానికి విషాదాన్ని కలిగించకపోతే నా పేరు...

చల : శంకరగిరి శంకరంగారే కాదు.

శంక : ఆc! అదే చూడు (సిగరెట్ దమ్ము పీల్చి) చలపతీ! అసలీ జమీందారు చంద్రంగా డెవడో నేనే ముందుగా మద్రాసు వెళ్ళి ఆ చంద్రంగాడ్ని మట్టుపెడతాను. నన్ను కాదని ఈ తండ్రీ కూతుళ్ళు ఏ చెరువు నీరు త్రాగుతారో చూస్తాను.

చల : మీరు మన్నిస్తారంటే ఒక్క మాట మనవిచేస్తా.

శంక : యేమిటది?

చల : అహాc! యేమీ లేదు! ఈ చంద్రం పేరు వినేసరికి సూర్యంగాడు చెమట్లు కార్చుకున్నాడు దీన్ని బట్టి చూస్తే వీడికి ఈ తతంగం యేమిటో తెలుసునని అనుమానంగావుంది. కర్మం! వాళ్ళ తమ్ముడు చంద్రమే ఈ జమీందారు చంద్రం కాదుగదా!

శంక : సూర్యంగాడు తెలిసినా చెప్పడు చంద్ర మెవడైనా దీనినే తెలుసుకుని వాడి అంతు తేల్చుకుంటాను.

చల : దానికేంగాని యెల్లగురించి సూర్యంగాడికి వెయ్యి రూపాయలు యిచ్చావుగా?

శంక : యిచ్చాను.

చల : ఆః! అన్నట్లు చెప్పటం మరచాను.

శంక : ఏమిటది?

చల : మన సమితిలో పనిచేస్తున్నా కమలమ్మ పంతులమ్మ పరుగు పరుగున వచ్చిపడి మా ఇంటివద్ద మొత్తుకుంది.

శంక : ఎందుకూ?

చల : మీరు తనని పెండ్లిచేసుకుంటానని చెప్పి జీవితాన్ని నాశనం చేసారని, యిప్పుడు తను ఆరునెలల గర్భవతినని చెప్పి మీరు మర్యాదగా పెండ్లిచేసుకుంటారా సరే, లేదా ఇటు మీ మామయ్యకూ, అటూ ఊరిలోని యిటువంటి వ్యవహారాలన్నీ సక్రమంగా చక్కపరచే సన్యాసులసంఘం ఆ యువజన సంఘం వాళ్ళకి తెలియపరచి మీ పరువుప్రతిష్టల్ని గోదాట్లో కలిపేస్తానని ఒకటేగోల. ఈగోల వినటానికి యిరుగుపొరుగునున్న వాళ్ళందరూ చుట్టూచేరి నోళ్ళు నొక్కుకున్నారు ఆ దెబ్బతో కాలుజారిన పిల్లిలా యిలాజారుకొని వచ్చాను.

శంక : అయితే దానిసంగతి యింతవరకూ వచ్చిందన్నమాట ఏదో చదువుకొని పనిపాటు లేదుగదాయని సమితిలో ఉద్యోగమిప్పించి కావలసినప్పుడల్లా పదో పరకో ముట్టచెప్పింది చాలదూ? ఇంకా పెండ్లిచేసుకోవాలా

పెండ్లి? ఇలా పంతం పట్టినవాళ్ళు మనచేతిలో ఎంత మంది హతమయ్యారు. ఇదిగో చలపతీ! ఈ రాత్రే దీన్ని అంతంచెయ్యాలి. జాగ్రత్తగా ఆలోచించు ప్లాను!

చల : ఆలోచన అంతకుముందే అయిపోయిందండి. ఒక్క దెబ్బలో రెండు పిట్టలు.

శంక : ఏమిటది?

చల : ఈరాత్రే పంతులమ్మ వుంటున్నా యింటికి నిప్పుపెడి తే ఈ ఊరంతా తగులడుతుంది. అప్పుడు అందర్ని పిలచి తలొక పదిరూపాయలు 'యిల్లు కట్టుకోమని' దానం చేస్తే దానితో తమ పేరు మారుమ్రోగిపోతుంది. అప్పుడు ఈయువజనసంఘాలు ఏంసహాయంచేస్తారో మనం చూద్దాం!

శంక : మంచిపని అంటాను నీవు ఈరాత్రే ఈపనికానిస్తాచేసా వంటే పీడ వదలిపోతుంది. ఏదో అవసరం కొలది అన్నమాటలకు పెళ్ళి చేసుకోవాలట పెళ్ళి. ఆఁ చలపతీ! నేను ఈరోజే మద్రాసు వెళ్లి ఈ చంద్రం ఎక్కడో తెలుసుకొని వీళ్ళ ప్రయాణాన్ని ప్రళయంగా మార్చి వీళ్ళ అంతు కనుక్కుంటాను. ఇదిగో చెక్కు, అయిదు వేలు తీసికొని అవసరాన్నిబట్టి డబ్బు ఖర్చు పెట్టు. నేను మద్రాసు వెళ్ళివస్తాను (చెక్కు-యిచ్చి లోనికి వెళ్తాడు.)

చల : (ఆ చెక్కు తీసుకొని కండ్లకు అద్దుకొని) అహాహా! చెక్కు, ఐదువేలు! ఇలాంటి కార్యశూరులు పది కాలాలుపాటు బ్రతకాలి. అప్పుడు పది తరాలవరకు డబ్బు తడుముకోనవసరం లేకుండగా దొర్లిపోతుంది. (వికటంగా నవ్వుతూ) అహాహా! ఈ రాత్రే ఊరంతా ఫైరు! అహాహా! లంకాదహనం!! అహాహా (నవ్వుతూ లోనికి వెళ్తాడు.)

# రక్తపాశం

## 5వ రంగం

[ఆది చంద్రం స్టడీరూము. రంగాలంకరణ అంతా మూడవరంగం మాదిరే. టేబుల్ ముందున్న కుర్చీలో చంద్రం కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటుంటాడు. సూర్యం మస్తాను వేషంలో వస్తాడు. అంతా కాబోలీవాలా వాలకంలాగ వుంటుంది. సాహేబు గెడ్డంలా అస్తమానుదువ్వి వడిత్రిప్పుతుంటాడు, అతని మాటా-నడకా-చూపు అంతా విచిత్రంగా వుండాలి. అసలు అతనే సూర్యం అని తెలియనీయకుండగా దిగ్భ్రమ చెందేటట్లు వేషభావల్లోనూ-నటనారీతుల్లోనూ జాగ్రత్త వహించాలి.

మస్తా: (ప్రవేశించి) నమస్తే! సాబ్!

చం: నమస్తే! నమస్తే! (ఆశ్చర్యంగా) మీరు?

మస్తా: నాకీ మస్తాన్ అంటార్ సాబ్!

చం: అలాగా! అయితే ఎవరుకావాలి మీకు?

మస్తా: ఇదర్ పడునేవా లే ఏక్ బాబూ! (కొంచెం ఆలోచించి) ఉస్ కా నామ్ చంద్రంబాబూ! జీ హాఁడీ! హెక్డహుంది ఆప్ కా మాలుం హాయితే చెప్పండి సాబ్! (మీసాన్ని సవరించుకొంటాడు.)

చం: అతనితో నీకేంపని?

మస్తా: యహాఁ బడా కామ్ హైజీ!

చం: ఇంతకుముం దెప్పుడైనా అతన్ని చూశావా?

మస్తా : (చిరుకోపంతో) నై ! ఉస్ కా బాబుకీ సూచీనాం. అయితే మీకీ హెందుక్ అడుగుతాంమయా! ఆప్‌కో మా.లూం హైతే సెప్పండి, నైతో లేద్.

చం : అంత కోపమేమిటోయ్ ? (కొంచెం కోపంగా) నాకు తెలియదు వెళ్ళు.

మస్తా: హరే హేప్ప్ హాండే! గుస్స గుస్స మంటూ జబర్ దస్తీ బాత్ చేస్తార్. మాకీ చంద్రంబాబుకీ ఘుర్ కా గల్లీ చెప్పమంటాం. చెప్కపోతే యిదర్ సే వెళ్ళిపోతాం. గుస్స దేనిక్ హాండీ? (వెళ్ళబోతాడు)

చం : ఏయ్ మస్తాన్ ! (గట్టిగా కేక వేస్తాడు)

మస్తా: (ఆగి) మస్తాన్ ! మస్తాన్ ! హంటూ హాస్తమాను హంటార్‌గాని, ఏక్ మనిషికి మకాం చెప్పే మనిషి లేదూ హాండి యీ లోకంలో.

చల : హైునే అసే క్యాజీ! ఉస్ కా బడాబాయీ హంటా నయా జమీందార్ సూర్యం బాబూజీ హాయనిక్ నేను వచ్చినాను. అని నాకీ నౌకరీ హిచ్చి హజార్ రూప్యా ఏక్ చీటీ నాకీ హాత్ మె పెట్టి పట్టికి వెళ్ళమంటే యిక్కడిక్ వచ్చినాన్ హాండీ.

చం : (ఆశ్చర్యంగా) అన్నయ్య దగ్గర నుంచి వచ్చావా?

మస్తా: (హేళనగా నవ్వుతూ) హారే హాన్నయ్య కానూ హెండీ!

చం : మస్తాన్ ! ఆ చంద్రాన్ని నేనే.

మస్తా: (చంద్రంవంక ఆశ్చర్యంగా చూస్తూ) హ రే హాల్లా! హేమ్టి మీారు చంద్రం!

చం : అవును. నేనే చంద్రాన్ని! కాని...

మస్తా: కాని యేమిటి యాండి? యేమ్టి కాని బోలోజీ బోలో! (మీాసాన్ని సవరించుకుంటాడు)

చం : మా అన్నయ్య సూర్యం చాలా పేదవాడు. కాని నీవు నయా జమీందార్ అంటున్నావేమిటి?

మస్తా: అవును హాండీ! ఉస్ కా గరీబ్, సూర్యం బాబూ హిప్డూ హామీారు హాయ్యినారు హాండీ.

చం : (అర్థంకానట్లు) అంటే ?

మస్తా: (చిరునవ్వు నవ్వుతూ) హా రే! హాంటే గింటే హేమ్టి హాండీ? హింటే మీాకు తెలిసిపోతుంది. మొన్న హాంటే పాంచ దిన్ కే పైలే లాటరీమే లక్కా గా లఖ్ రూపియా వచ్చినాయి హాండీ సాబ్.

చం : (ఆనందగా) ఆఁ! అన్నయ్యకు లాటరీ వచ్చిందా?

మస్తా: జీ సాబ్! వచ్చిందిహాండీ! మీాకీ భాయి ఏక్ హజార్ రూప్యా, ఏక్ చీటీ యిచ్చినారూ హాండీ. (1000 రూపాయల చెక్కు, ఒక కవరు యిస్తాడు)

చం : అని (అందుకొని ఆత్రుతగా కవరుచించి) "చిరంజీవి తమ్ముడికి, మీా అన్న దీవించి వ్రా యు న ది.

యిక్కడ అంతా క్షేమము. నేను చాలా సంతోష
కరమైన వార్త తెలియజేయాలనే ఈ ఉత్తరం
వ్రాస్తున్నాను భగవంతుని దయవలన లక్ష రూపా
యిలు లాటరీ వచ్చింది. యిక మన కష్టాలన్నీ
గట్టెక్కినట్లే! ముఖ్యంగా నీకు వచ్చిన అమ్మాయిని
ఎవరినైనా చూచుకొని వెంటనే పెండ్లి చేసుకో
వలయును. నీకు ఆ మూడుముళ్లు పడితే మా బరువూ
బాధ్యతకూడా తీరిపోతుంది. నేను మనకు లాటరీవస్తే
వెంకటరమణమూర్తికి నైవేద్యం అర్పిస్తానని మ్రొక్కు
కున్నాను. అందుకని నేనూ, నాన్నా తిరుపతి వెళ్లు
చున్నాము. అందుచే నీవు మేము లేమని దిగులుచెందక
నీవు నిర్ణయించుకున్న ప్రకారముగానే మేము వచ్చే
లోపుగా పెండ్లి చేసుకోవలయును. పెండ్లికి మేము
లేమని అన్యథాభావించి సుముహూర్తాన్ని ఆపుచేసు
కోక వెంటనే చేసుకో! మస్తాన్ చాలా మంచినమ్మ
కమైనవాడు. అన్ని పనులలో నీకు అండదండగా
వుంటాడని యితన్ని నీవద్దకు పంపుచున్నాను. ఇతన్నే
నేనుగా భావించి ఈతని ఆసరాతో అన్నిపనులూ
పూర్తి చేసుకోవలెను - ఇట్లు మీఅన్న సూర్యం."
(ఆనందంగా) ఇంతమంచి అన్నదొరకటం నాఅదృష్టం!

శేఖ: (ప్రవేశిస్తూ) అదృష్టం అర్రులుచాచుకు రావటం నీకు మహాఅదృష్టం. అందుకే అవతలవాళ్ళు కాళ్ళమీద పడుతున్నారు.

చం: హల్లో శేఖర్! రారా! ఏమిటి అన్నావ్! ఎవరి కాళ్ళమీద పడుతున్నది?

మస్తా: (నవ్వుతూ) అహా ఇలేమం బాబు! అరే హేంప్టీ
డాండీ యింత గడిబ్బిడి మనిషి వా డీ మిారు.

చం: ఏమిట్రా ఏబ్రాటులంటున్నావు? కర్మదీసి ఏమన్నా
ప్రళయం లేదుకదా?

శేఖ: నో, నో, ప్రళయంకాదు బ్రదర్ ప్రణయమే!

చం: (ఆశ్చర్యంగా) ప్రణయమా?

శేఖ: అవునురా! నేనీమాట చెప్పానో లేదో వున్నట్లుండి
ఆమెలో సిగ్గులు చిగురించేయి. ఆసిగ్గుకి నిగ్గుగా
ఆమెబుగ్గలు ఎరుపెక్కేయి. కన్నులు బరువెక్కేయి
నీపేరును స్మరిస్తూ ఆమె అర్థనిమీలిత నేత్రాలతో...

చం: ఆగరా మిస్టర్ ఆగు!

శేఖ: అదేం?

చం: యింతకి ఆమె ఎవరు?

శేఖ: (హాస్యంగా) వాట్? అహాఁ! ఎవరని అడగే మన
గాడా? అయినా ఎవరయితే నీకేలా? (మస్తాను
నవ్వుతాడు)

చం: వాట్? అరెయ్! నీ హాస్యానికి అంతులేదురా.

శేఖ: అంతులోనే గంతు లేసింది. యింతలోనే చెంత
కొచ్చింది. చేరెడు కాఫీ యిచ్చింది. ఆ యిచ్చిన
కాఫీ సాఫీగా నాగొంతు సొచ్చింది.

చం: అసలు ఇంతకీ ఏ మొచ్చిందిరా!

శేఖ: వచ్చిందిరా వచ్చింది. కాంతవలచి వచ్చింది. కాలం కలసి వచ్చింది. అందుకే కళ్యాణం ముందుకొచ్చింది.

మస్తా: హారే వచ్చింది, చచ్చింది హేస్టిమిూ హూ పిచ్చి వాడిలా! హాచ్చా తరహా చెప్పండీ.

శేఖ: మరి నేచెప్పింది తప్పుగా భావించకుండగా తప్పక ఒప్పుకుంటారా?

చం: అది సరేలే! ముందు అదేమిటో చెప్పు?

శేఖ: నేను యిక్కడనుంచి సరాసరి తారా కుమారీగారి గృహామున కేగితిని.

మస్తా: అరే! హేగితిని, గీగితిని హేస్టి మాటల్ హాండీ.

శేఖ: అదేనోయ్! వెళ్ళితిని.

చం: సరే చెప్పరా!

శేఖ: అదేరా! వెళ్ళేనా, వెళ్ళేసరికి ఆమె నావంక ఆశగా చూచింది. పాపం నాకు జాలి వేసిందిరా!

మస్తా: అసలు మిూకి గాలి మనిషి హాండీ! ఆడదాని చూస్తే మిూకి జాలి హెందుక్కు హాండీ!

చం: అదిసరేగాని అసలు విషయం చెప్పరా.

శేఖ: చెప్పేదేమిట్రా? ఒప్పుకొని వస్తేను.

చం॥ ఎందుక్కు ఒప్పుకొని ? ఎవరితో ఒప్పుకొని ?

శేఖ: ఎవరితోనా ? కుమారి తారాగారిక్కు మిూరు తాడు తప్పక కడతారని.

చం: మొత్తానికి పెద్దబుర్రేసేది! నేనేదో జమీందారునని చెప్పి ఆ అమ్మాయిని అమాయకురాలినిగా చేసి ఆడిస్తున్నావన్నమాట?

శేఖ: ఏమాడిస్తున్నాన్రా?

మస్తా: పెండిలి ఆడిస్తూన్నార్ కాదాసాబ్!

శేఖ: దట్సు కరెక్టు. అలా అన్నావు బావుంది. నూరు అబద్ధాలు ఆడైనా ఒక పెండ్లి చెయ్యమన్నారు పెద్దలు. చంద్రం! నాకు మాత్రం ఒక భయంగా వుందిరా!

చం: భయమా? ఎందుకూ?

శేఖ: ఎందుకేమిట్రా? మన మిద్దరం కాలేజీ చదువులో ఏరోజు కారోజు కేరేజీలో తినేవాళ్ళ, ఈ మేరేజీ అవటంతో క్యారేజ్ క్యాన్సిల్ అవుతుందని ఫియర్ గా వుందిరా డియర్!

చం: (నవ్వుతూ) డోంట్ ఫియర్ మిస్టర్ శేఖర్ నేక్లియరు చెప్తాతున్నా విను నేను ఎక్కడున్నా నీవు అక్కడే వుందువుగాని సరేనా?

మస్తా: జీసాబ్! అచ్చా బాత్ బోలే!

చం: యింతకు శేఖర్! మనం గొప్ప జమిందార్లమని చెప్పే వుంటావుగా! అయితే వాళ్ళని ఏ యిస్టేటు లున్నాయని, నస్టేటులో కలుపుతున్నావురా?

శేఖ: అదా? ఎస్టేటు పేరు చెప్పలేదురా! ప్రస్తుతం ఆంధ్రా స్టేటని చెప్పేను (నాలుక కరుచుకొని) అరెరే అసలు చెప్పవలసింది మరచేను.

చం : ఏంటది?

శేఖ: ఇప్పుడే వర్క్ అవర్ లో తార ఇక్కడకు వస్తానందిరా!

చం : యిక్కడికా? ఎందుకు?

శేఖ : ఎందుకేంటిరా? కాబోయే వాళ్ళ కష్టసుఖాలు చెప్పుకోవటానికి.

చం : అయితే ఈ ఏర్పాట్లన్నీ తమరే చేకొని వచ్చారన్నమాట?

శేఖ : అన్నమాటేంటిరా? వున్నమాట అదేగా.

చం : చచ్చాం! అయితే యిప్పుడెలారా?

శేఖ: నీకు భయంలేదు నేను చూచుకుంటానుగా? ఇదిగో సహెబుగారూ! ఐ యామ్ సారీ! మస్తాన్! నీవు నేను చెప్పినట్లు చెయ్యాలి!

మస్తా: (వినయంగా) జీబోలో!

శేఖ: అతి జాగ్రత్తగా నడుచుకోవాల.

మస్తా: హై దేకూంగాజీ! అప్ కా డర్ హెూ-ద్కు హాండీ?

శేఖ: యిప్పుడు మన చంద్రం బాబుగార్కి కాబోయే! జమిందారిణిగా రొస్తున్నారు. తగిన ఏర్పాట్లన్నీ వెంటనే చేయాలి సరే నీవు లోనికి వెళ్ళి అన్నీ పనులూ చూచుకో.

మస్తా: జీ సాబ్! (కలాం పెట్టి లోనికి వెళ్తాడు)

శేఖ: మొత్తానికి మంచి మస్తాను దొరికాడురా మనికి.

చం: అవును చాలా మంచివాడులాగే యున్నాడు. ఇంతకీ కూడా ఎవ్వరైనా వస్తారా?

శేఖ: ఆ చోటి కొంచయ్య ఉన్నాడుగా! (చేతిలో టైము చూచి) అరే వచ్చే టైంమయిందే! యీలోగా మనం మంచి నాటకం ఆడాలి.

చం: ఏమిటది ?

శేఖ: నేను అడిగిన దానికి సమాధానము చెప్పాలి అంతా జమిందారు స్టయిల్‌లో వుండాలి. ఆఁ చూడు! (గొంతుక సవరించుకొని) మిస్టరు చంద్రంగారూ! మన అల్యూమినియం కంపెనీలో అందరూ పాత మేనేజరు పనికిరాడని స్ట్రయిక్ చేసారట?

చం: (పరధ్యానంగా) అయితే మనం పనికి వస్తామా?

శేఖ: ఏడ్చినట్లుంది మన జమీందారీ పద్ధతి!

చం: (తమాయించి) ఓఁ సారీ!

శేఖ: పాటలమధ్య పదేపదే హరోహరి అన్నట్లు తప్పుడు మాట్లాడడం, తప్పు కప్పిపుచ్చటానికి మాటలమధ్య ఐ యాం సారీ! అనటం సారీ దేరి ఈజ్ నో లారీ ఫర్ కేరీ. యూవర్ సారీ టు బళ్ళారి, అన్నట్లు ఏ సారీని కేర్ చేయులేం కానీ ఈ మూడుముళ్ళ పడే

వరకు మనగుట్టు బయటపడకుండగా కొంచెం జాగ్రత్తగా నడుచుకోవాలి.

చం: అలాగే శేఖరా!

శేఖ: (కుర్చీలోనుండి లేచి ప్రక్కకు చూచి) ఒరేయ్! వాళ్లు వస్తున్నారా! ఆ! ఇప్పుడు జాగ్రత్త!

చం: (ఠీవిగా కూర్చుంటాడు)

శేఖ: (గొంతుక సవరించుకొని) ఆ! చూడండి! సింగరేణి బొగ్గు గనులనుండి ఎక్స్‌పోర్ట్ అండ్ ఇంపోర్టుశాఖలూను బుక్స్ నౌకరు మన్నాను తీసుకువచ్చాను. అవి తమరు ఒకసారి పరిశీలించండి.

చం: ఓయస్! ఆఫీసు ఫైలంతా ఒకసారి చూస్తాను

శేఖ: రండి! ఆఫీసు రూమ్‌లో వున్నాయి. (ఇరువురూ లోనికి వెళ్తారు. బయటనుండి తార ప్రవేశించి రూమ్‌అంతా కలియజూచి టేబుల్ మీదనున్న చంద్రం ఫొటో తీసుకొని సంతోషంతో పాటపాడును)

కనులారా కాంచె - కలలోనే పిలిచె

నీ చెలి పిలిచె - రావోయీ!

నా వయసు నీది నీ వలపు నాది

మన మమతలు - కలసినవోయీ!

మన యిరువురదే - ఈ రేయీ!

మన యిరువుర - మొకటే లేవోయీ! ...కను

అశతో అందియలు - నిన్నే వెదకెనోయీ!
జాలిగా సారంగి - నిన్నే పిలచెనోయీ!
కోరికలే తారకలై - తొంగి చూచెనే!
తారకలే నీ కొరకే - తరలి వొచ్చెనే! ...కను
(పాట అనంతరం తదేకదృష్టితో చంద్రం ఫోటోవంక చూస్తూ తన్మయత్వం చెందుతుంటాది.)

చెం : (నెమ్మదిగా ప్రవేశించి) తా... తా... తారమ్మగారూ తారమ్మగారూ! (నవ్వుతూ) నా ... నా...యింటా పటారంగానూ! అ...అ...అయ్యగారి యిల్లుయె... యె...యెలాగుందమ్మగోరూ!

తార : (ఉలిక్కిపడి తన చేతిలోని ఫోటో చెంచయ్య చూడకుండా నెమ్మదిగా టేబుల్ మీద పెట్టి హేండ్ బాగ్ ఊపుతూ వయ్యారంగా నలుమూలలా పరికించ బడుతూ) ఆఁ! చాలా బాగుంది. చాలా బాగుంది చెంచయ్యా! ఇక్కడ యెవరూ లేరేం?

చెం : యే...యే... యేటంతారు? కారా! ఉ ... ఉ... ఉంతాది లేమ్మా.

తార : కాదుకాదు. ఇక్కడ (సైగ చేసి చెపుతుంది)

చెం : ఎ... ఎ... ఎవరూ లేరంతారా? ఉ ... ఉంటారు లోపల.

తార: ఔను! లోపల ఎవరున్నారో పిలు.

చెం : బ...బ...బయట ఎల్లివుంచమంటారా ? చి...చి...చిత్తం! అలాగే, (బయటకు వెళ్ళబోతాడు)

తార : (అడ్డుకొని) సీతో చావొచ్చిపడిందిరా! (సంజ్ఞ చేస్తూ) లోపల ఎవరున్నారో పిలు.

చెం : ఓః అదా! చి...చి...చిత్తం! చిత్తం! ఎ...ఏ...ఎవరండి లోపల ? ఏ...ఏ...ఏమండోయ్, లోపల ఎవరండీ ? (పదేపదే పిలుస్తాడు)

మస్తా : (ప్రవేశిస్తూ) అరే! హేప్టి హూండీ. మాకీ గడిబిడి చేస్తారు ? (తారను చూస్తూ) అరే! ఆప్ కౌను హూండి అమ్మాయిగారు ?

తార : (అతను) ఎవరో అని చెప్పినట్లు చెంచయ్యకు సంజ్ఞ చేస్తుంది.)

చెం : యి...యి... అమ్మాయిగోరు మా...మా...చిన్నమ్మాయిగోరుఅంటే చీ...చీపురం జమీందారుణిగోరన్నమాట.

మస్తా : అచ్చా! ఆప్ కా నాం హేంటీ హూండీ ?

తార : తా బి. ఏ.

మస్తా : అచ్చా! జీ హమ్మగార్ ! తారా బిహైగార్ ఆప్‌కి నుంచుకొని వున్నార్ కూచుకోండి, కూచుకోండి అమ్మా ! (కుర్చీ చూపుతాడు)

తార : (కూర్చుంటుంది)

మస్తా : ఆప్ గరమ్ గరమ్ చాయీ తీసుకుంటార్ హూండీ !

తార : ఖ్యా[illegible]! [illegible]కంటేమిటే! ప్రస్తుతం మీ అయ్య గారు ఇంట్లో వున్నారా?

మస్తా : హారే! హాయ్యగార్ హింట్లో లేక హెక్కడికి వెళ్ళింది లేదు హాండీ! మాది అయ్యగార్ బడా జంమిదార్ బాబూ కదుహాండీ! ఇస్‌లియే! ఆనే వాలా-జానేవాలా-ఖానావాలా కిత్ నామ ది హాండీ

తార : (నవ్వుతూ) అయితే అంత బిజిగా వుంటారా మీ అయ్యగారు?

మస్తా : జీ! అమ్మగార్! మాకీ అయ్యగారితో మీకు క్యా కామ్ హాండీ?

తార : పనుండీ వచ్చాం! ఆఁ! నీ పేరేమిటో తెలుసుకో వచ్చా?

మస్తా : క్యోం నహీ? తారా దేవిగార్! మేరే నామ్ మస్తాన్ హాండీ?

చెం : (నవ్వుతూ) చ...చ... చత్తానంటావా? ని...ని... నీకేం వచ్చింది? అ...అ... అయ్యగారి యింట్లో...

మస్తా : (నవ్వుతూ) మస్తాను హంటే చస్తాన్ హంటాడ్ హాడికి హేమ్టి జాడ్యము హాండీ?

తార : (నవ్వుతూ) ఓఁ! అదా! అతడికి కొంచెం చెముడు లే

మస్తా : హారే! హాత్కి రహస్యం బట్టబయల్‌గా చేస్తాడ్ చెముడువాడు ఏమిటి హమ్మ!

తార : ఆఁ! మస్తాన్ మీ అయ్యగార్ని కొంచెం పిలుస్తావ్

పట్టుకొన్న ప్రియుడు ములగకొమ్మని యిక ముందే తెలుసుకుంటావు జాగ్రత్త! పిచ్చి పిచ్చి ఊహాలతో మనస్సు పాడుచేసుకోక నడు యింటికి నిన్ను ఏనాడో నాడానిగా చేసిపెట్టేడు మీనాన్న! (చెయ్యి పట్టుకొని లాగబోతాడు)

తార : షటాప్! (చెయ్యి విదిలించుకొని చెంపమీదకొట్టి గబగబా బయటకు వెళ్తాది)

శంక : (చెంప పట్టుకొని పళ్ళు పట పట కొరుకుతూ) ఎంత మిడసరం! ముందొచ్చిన చెవ్వులకంటే వెనుకొచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు నాకళ్ళెదుటే పుట్టి నన్ను తిరస్కరించి మరొకడ్ని పెళ్ళాడుతుందట! వెళ్ళి వీడేదో గొప్ప జమీందారని భ్రమసిపోతుందేగాని ఈపగటివేషగాడిని పసికట్టలేక పోయింది. కోపాన్ని ఆపుకోలేక చెయ్యి విసిరింది. పాపం! దీన్ని తాపాన్ని ఈనాడే అంత మొందిస్తాను. క్లాసుమేటట! క్లాసు మేటు - గడ్డిమేటును. (ఇటూ నటూ చూచి) ఎవడ్రా లోపల? రాస్కెల్! మాట్లాడ్డే? (గట్టిగా) ఎవడ్రా లోపల?

మస్తా: (ప్రవేశించి) తూ త్తేరీ! రాస్కేల్ ఎవడురా బోల్తావ్ సీకే ఎవడూ హూండీ?

శంక : (సిగరెట్టు పొగ పీల్చి సీరియస్‌గా పేంటు జేబుల్లో చేతులు పెట్టుకొని) నేనెవ్వరో సీకనవసరం! నేను ముందడిగినదానికి సమాధానం చెప్పు.

మస్తా: బస్కు పేస్ట్రి ముసుక్కు గావ్తా! బుస్కుంచిన వాళ్కు-
చెప్పేది హేంటిహైయ్యా!

శంక : (పళ్ళు కొరుకుతూ) ఊఁ! నువ్వు చెప్పేదేఁటి నే
చెప్పిస్తాన్! (హేళనగా) ఏడా చంద్రంగాడు;

మస్తా: (హేళనగా) చంద్రంగాడు అని గంద్రాగోళంచేస్తావు.
హారే చంద్రంగాడు హెవుడు హాఁడీ?

శంం : ఎవడా? కూటికి గతిలేక గొడ్డుమేసే గడ్డి అమ్ము
కుంటేనేగాని గడవని వెధవలు పట్నం చేరి పగటి
వేషాలతో మోసాలు సాగించి పేర్లు మార్చుకుని
పెద్దగా డబ్బుచావును కుంటున్నా డేమో చూస్తా.

మస్తా: కౌన్ హాఁడీ పేర్లు మార్చేదీ? బడా బడా లహూది
కాల్ బీద సాదల్‌కి కడుపుకొట్టి హైపిపెట్టి పేర్లు
మార్చుకొంటార్ హాండీ! బడా బడా జమిందారులు
ఖజానా మే డబ్బు హాంతా ముండల్ క్రింద హాజామత్
చేసి ముండా కొడుకుల్ పేర్లు మార్చుకుంటారు.

శంక : అవును పాపం! మీకేం తెలుస్తుంది? యిన్నాళ్ళు
మీకళ్ళకు గంతలుకట్టి మీతో వంతులు పాటిస్తు
సంతసిస్తున్నారు. యీనాటితో అంత మొందిస్తాను
పిలు! (సిగరెట్టు కాలుస్తాడు)

మస్తా: హారే! అంతం గింతం అని మంత్రం చదుక్తార్
కౌన్‌కి హాండీ పిలిచేది?

శంక : ఎవ్వరినా! కల్లబొల్లి మాటలతో ప్రజల కళ్ళు కప్పి
జమీందారు చంద్రంబాబు అని అంతర్ నాటక
మాడుతున్నా ఆ చంద్రంగాడ్ని!

మస్తా: (ఏదో ఆలోచించి) హైసా బోల్‌తార్! తప్పు హాండీ సాబ్.

శంక : అవును, తప్పని తెలిసికూడా తప్పనిసరిగా గొప్ప సాగిస్తున్నాను. ఇంతవరకు నీకు తెలియదా లేక? తెలుసుండీ నీవు కూడా యీ నాటకంలో వేషమేశావా?

మస్తా: (ఆశ్చర్యంగా) హే భగవాన్! కొంపకూలింది. (నెత్తిమీద చెయ్యి వేసుకొని యేడ్పు ముఖం పెట్టి) హారే హల్లా! అభి మై క్యాకరూం?

శంక : మరి నీవేడుస్తా వెందుకు?

మస్తా: హారే! మూడు నెలలకి జీతం ఇవ్వక, నేను ఏడుస్తుంటాని! నాకిబసి మీకీ ఏడుస్తార్ అంటారు హాండీ!

శంక : ఏమిటీ? నీవు వాడికి నౌకరువా? నీకు వాడు మూడు నెలలు జీతం బాకీయా?

మస్తా: జీహాఁ సాబ్! వీడికి బడా జమిందారని మోసపోయి నౌకరీ చేసినాను హాండీ. యిప్పుడు వీడిక్కి వంట చేస్తున్నానూ హాండీ!

శంక : ఇంతకీ ఆ పగటి వేషగాడు యింటిలో లేడా?

మస్తా: అభి లైబ్రరీ పోయాడు హాండీ! ఇపుడు అర్ధగంటకు వస్తాడు హాండీ! జీ సాబ్ ఒకమాట.

శంక : ఏంటది?

మస్తా: వీడిక్కి వెనుక ముంద్ ఎవరు హాండీ?

శంక : లేకేం! పొగరుబోతు అన్నా, పడుతూ లేస్తున్నా తండ్రి వున్నారు.

మస్తా: ఇక్కడ వున్నాడండీ.

శంక : ఇంకెక్కడుంటాడు? ఆ రౌడీ వెధవ కొమ్ములువంచి వాడి ఎల్లు తీసుకున్నాను. అంతటితో వాడు ఊరు విడచి పరారైయ్యాడు. ఆ ముసలివాడు మసలే కొంపకు ఈరోజు నిప్పుపెట్టమని మా చలపతిని పంపేను. వాడిపని కాస్త పూర్తిఅయితే యిక అన్ని రోగాలు కుదురుతాయ్.

మస్తా: మంచిపని చేసినారు హుంజీ! వాడ్కి నేను బుద్ధి చెప్తాను. మీరకీ చూడండి. జీ సాబ్! మై అభీ ఆతాహుం కూసుకోండి! (లోనికి వెళ్తాడు. అంతలో శేఖర్ చేతికర్ర కత్తి పట్టుకొని ప్రవేశిస్తాడు)

శేఖ : ( శంకరాన్ని చూచి వినయంగా ) ఎవరండి మీరు?

శంక: నీ పాలిట మృత్యువును.

శేఖ : మాటలు మంచిగా రానీయండి. మీరెవరో నాకు తెలియదుగాని వీపు చెడుతుంది.

శంక . నీలాంటి వంచకుడికి మంచిని ఎంచే యోగ్యతవుందా? కల్లబొల్లి మాటలతో అమాయకులైన ఆడపిల్లల్ని వలలో వేసుకొని కులుకుతా మనుకున్నావా? యీ రోజుతో నీ ఆయువు మూడింది. ( వికటంగా నవ్వి మీదికి దూకబోతాడు.

శేఖ : ( చేతిలోని హేండు స్టిక్‌లోని కత్తిదూసి ) ఆగు

[illegible]
యింతకీ యెవరు నీవు?

శంక : (హేళనగా) ఎవరినా? ఎవ్వరిని! నీవు జమీందారుగా వేషం వేసుకుని మోసంచేసి పెళ్లాడాలని కలలు కంటున్నావో ఆ కలలన్నీ అలలుగా మార్చే ఆమెకు కాబోయే భర్తను- మేనత్త కొడుకును.

శేఖ : (ఆశ్చర్యంగా) ఆఁ! నువ్వా?

శంక : ఏమిటి ఆలోచిస్తున్నావు? నీగుండె దిగజారిపోయిందా?

శేఖ : కాదు, నీలాంటి రాతిబండకు యెలా బుద్ధి చెప్పడం అని ఆలోచిస్తున్నాను. (లోపకి చూచి) ఒరేయ్ ! చంద్రం ! చంద్రం !

శంక : (ఆశ్చర్యంగా) ఓఁ! అయితే నీవు కాదన్నమాట! అయితే నీవు ఎంబాసిడర్ వన్నమాట ! ఏడీ వాడు?

శేఖ : వస్తాడు! వాడుకూడావస్తే నీవు వచ్చినదారిని మర్చిపోతావు !

శంక : (కళ్ళెర్రజేసి చేయిత్తి గట్టిగా) ఏయ్.

శేఖ : (కత్తిచూపి) ఊ! దించు చెయ్యి !

శంక : (తెల్లబోతాడు)

శేఖ : (గర్జిస్తూ) ఊఁ! దించు!

శంక : (ఎత్తిన చెయ్యి దించి మిగ్రున కోపముతో యోగాదిగా చూస్తుంటాడు.)

శేఖ : జాగ్రత్త ! కాలు కదిపేవా కత్తిజా లూడపడతాయి పట్టైటూళ్ళలో అణ్యాం పుణ్యాం ఎరుగని అమాయకుకు లనుకున్నా ... ఆడించటానికి ? వీడెవడో తెలుసా ? ... మేనమరదలకు కాబోయే భర్తకి దగ్గర స్నేహి ... డు శేఖర్;

మస్తా: (శంకరం వెనుకనుండి ప్రవేశించి శేఖరుకు కనుసైగ చేసి ) క్యారే ! జూఠా శేఖర్ ? ఏమిటి చెప్పాతు న్నావు? మాకీ శంకరం బాబుకి మీకి జూఠా అంతా తెలిసిపోయింది. ఇప్పుడు మీకీ భరతం పడతాగా (మీసం దువ్వుతాడు)

శేఖ : మస్తాన్ ! ఇంటిలో ఈగని, యింటివాసాలు లెక్కపెడతా వనుకోలేదు జాగ్రత్త ! (కనుసైగచేసి భయపడి నట్లు నటించి గబగబా బయటకు వెళ్ళాడు.

శంక : ( శేఖరు వెళ్ళిపోవడం చూచి సిగరెట్టు వెలిగించి నవ్వుతూ మస్తాన్ భుజంతట్టి ) మస్తాన్ నీవంటే బలే భయమే వీడికి.

మస్తా : (గెడ్డం సవరించుకొని నవ్వుతూ) నాకీ సంగత్ అభి క్యాఆప్ దేకే ? ముందుముందు సూస్కోండి. కూచోండి సాబ్ ! ఢర్ నహీ ! ఈ మస్తాన్ కీవస్తాద్ తనం చూద్దుర్ గాని.

శంక : (కుర్చీలో కూర్చుని సిగరెట్టు కాల్చుకుంటూ విరగ బడి నవ్వుతాడు.)

మస్తా: సాబ్ ! తోడా డ్రింక్ తీసుకుంటూరా హుజూర్ ?
శంక : నీలాంటివాడు యిస్తుంటే వద్దంటానా?
మస్తా: జీ సాబ్ ! అభీలా తేహూం ! (లోనికి వెళ్ళాడు)
శంక : (నవ్వుతూ గట్టిగా పొగపీల్చి) వచ్చినందుకు ఇక్కడ మంచివాడే దొరికాడు. ఇక మన కార్యం నిరాటంకముగా సాగిపోతుంది. వీడికి నాలుగు డబ్బులు పారేసి పని జయప్రదం సాగించుకోవచ్చు.
మస్తా: (గాజుగ్లాసులో డ్రింకు పోసి దానిలో మత్తు మందు కలిపి తీసుకువచ్చి) శంకర్ జీ! కాస్కోండి సాబ్ ! యిప్పుడు వాడికి ఖర్మం పడదాం ! (గ్లాసు అందిస్తాడు )
శంక : గ్లాసుఅందుకొని) వెరీగుడ్ మస్తాన్ ! నీలాంటివాడు నాదగ్గర వుండవలసినవాడు. ఇక నీవు నాతోనే వచ్చేయ్.
మస్తా: జీసాబ్ ! ముందు తమరు త్రాగండి హుజూర్ ! వాడు వచ్చేది టైం అయింది.
శంక : ఓ. కే. ( ఆ గ్లాసులోని డ్రింకు పూర్తిగా త్రాగి సిగరెట్టు వెలిగించి మత్తు వస్తున్నట్లు నటించి ) ఒరే ! ... మస్తాన్ ! ... మ ... స్తా ... ఏమై పోయావురా? (నెమ్మదిగా కుర్చీలో పడి పోతాడు. మస్తాన్, శంకరం జేబులోని పిస్తోలు తీసి మరో పిస్తోలు పెడతాడు అంతా చూస్తుండగా)

మస్తా: (నవ్వుతూ మీసం దువ్వుకొని) హెక్కిందీ ముండా కొడిక్కి హెక్కిందీ! బడా బడాజబర్ జస్తీ బాత్ చేస్తాన్! యిప్పుడు వీడిక్కి బాబుకోసు వస్తాడు చూస్తా! (లోపలికి వెళ్ళి త్రాడు తెచ్చి కుర్చీకి వాణ్ణి కట్టి) కైసాహై! వస్తాకా మజా! (తన చేతిలో పడివున్న శంకరం తలయెత్తి బయటకు వెళ్ళబోతాడు ఎదురుగా చంద్రం వస్తాడు)

చం : (ఆశ్చర్యంగా) ఏమిటి మస్తా! ఎవరితను? ఎందు కలా చేసావు?

మస్తా: వీడు మీకీ ప్రాణంకోసం వచ్చినా హాండీ! శేఖర్ బాబుకి పేణం తియ్యబోయాడు సాబ్.

చం : యింతకీ ఎవరితను?

శేఖ : (ప్రవేశించి) ఎవరా! పల్లెటూళ్ళలో పేద ప్రజల్ని నానాహింసలు పెడుతున్నా ఆ తారమ్మగారి బావట బావ! మంచిపని చేసావు మస్తా.

మస్తా: నాకి హేమ్టి సేయలేదు హాండీ! (చేతితో చూపుతూ అంత డ్రింకులో ఇంతమత్తుమందు కలిపినానుహాండీ.

శేఖ : చంద్రం! ఇక మనం ఆలస్యం చెయ్యకూడదు. చాలా టైమైంది. అక్కడ తార కారు రడీ చేసుకొని మన కొరకు ఎదురు చూస్తుంది. పదండి ముందు.

చం : ఓ! నీదే ఆలస్యం! (పేంటు జేబులో చేయి పెట్టు

కొని నడుస్తాడు. అతని వెనుక శేఖర్ చేతిలో హేండ్ రేడియో పట్టుకొని నడుస్తాడు)

మస్తా: (బెడ్డింగు పట్టుకొని శంకరం కుర్చీవద్దకు వెళ్ళి అతని తలయెత్తి) శంకర్ గిర్ శరకర్ గారూ! హమ్‌సాదీకి జాతాహోం! మీరు చచ్చిపడి వుండండి! నమస్తే. (సలాంపెట్టి నవ్వుతూ బయటకు వెళ్తాడు.)

... తెర ...



కుటుం: ఏరా చెంచయ్యా! తోరణాలు కట్టడం పూర్తి కాలేదా?

చెం : ఈ ... ఈ ... ఈరణాలు ఇంకా మో... మో... మ్రోగలేదంటారా? మో ... మోగుతాయి కాని బాబయ్యా! అ ... అ ... అమ్మాయిగోరు ఇంకా రానేదంటారా ?

కుటుం: (గట్టిగా) అమ్మాయి మాటకేంగాని! తోరణం కట్ట లేదాని!

చెం : (చెవికి చేతిని అడ్డుపెట్టుకొని) చి ... చి ... చిత్తం, చిత్తం! చి ... చి ... చిటికినో కట్టేయినండి.

కుటుం: చెంచయ్యా! పూల దండలు తెప్పించు.

చెం : చి...చి... చిత్తం! చిత్తం! పూర్ణం బూర్లువండించ మంటారా? (లోనికి వెళ్ళబోతాడు)

కుటుం: (గట్టిగా) ఒరేయ్! ఒరేయ్! పూర్ణం బూర్లు కాదోయ్! పూలదండలు.

చెం : చి...చి...చిత్తం! చిత్తం! పొద్దెన్నె తె...తె... తెచ్చానండి.

కుటుం: చెంచయ్యా! పురోహితుడొచ్చాడా?

చెం : పు... పు ... పురుడొచ్చిందంటారా? ఎ ...ఎ ... ఎవరికండీ?

కుటుం: (చిన్నగా నవ్వి గట్టిగా) పురుడు కాదోయ్, పురో హితుడు

చెం : అ...అ...అయ్యగారూ! బా...బా...బాపనయ్య అంటారా? చి ... చి ... చిత్తం! వచ్చారండి నో...నో...నోచున్నారు.

కుటుం: శంకరం నిన్నటినుండి కనిపించడంలేదు ఎక్కడికి పోయాడ్రా?

చెం : ఏ...ఏ...ఏంటి? ఈ యాల సనివారమంటారా. కా...కా...కాదండి! లగ్గానికి ఇ...ఇ...ఇయ్యాలే మంచిరోజు ల...లచ్చివారం.

కుటుం: (గట్టిగా) నీనెత్తి శంకరంరా అంటే సనివారం అంటావు! చెంచయ్యా.

చెం : అ...అ...అయ్యా!

కుటుం: బంగారం ధర ఏలావుందో ఈ మధ్య?

చెం : పొ...పొ...పొంగడాలా అండి! ము ... ము ... ముదరపాకం అయితే పో...పో...పోతుండలకంటే బాగుంటాయి యండీ.

కుటుం: (తలమీద చెయ్యిపెట్టుకుంటూ) నీతో చావొచ్చి పడింది: బంగారం ధరరా అంటే పొంగడాలూ, పోకుం డలూ అంటావు. (గట్టిగా) బంగారం ధరరా,

చెం : చి...చి...చిత్తం! బంగార అంటారా? మ ... మంచిబంగారం మ...మాటున మరీ ఎక్కువండీ.

కుటుం: అంటే ఎంత?

(16)

చెం : కా...కానయితే నా...నాయింటిమీద ఎనిమిదండీ.

కుటుం: కర్మ! (గట్టిగా) నీయింటిమీద ఎనిమిదేంటోయ్?

చెం : తె...తె...తెల్లోల బాసలో సల్లోళ్ళు ఎ... ఎ... ఎంగ్లేసు మాటాడుతారు కాదండి! ఆ... ఆ... ఆ ఎంగిలిముక్కలు నా...నానూ నేర్చుకున్నానండీ, తొ...తొంబై ఎనిమిది.

కుటుం: ఓస్! నైంటీ ఎయిటా? నీవు పోయి ఆ బ్రాహ్మణ కులపతిని ఒకసారి ఇలా పిలు.

చెం : చి...చి...చిత్తం! (లోనికి వెళ్తాడు)

కుటుం: (చేతి వాచీ టైమ్ చూచుకొని చెంచయ్య కట్టిన తోరణాలు సర్దుతుంటాడు)

చల : (చెంచయ్యతో ప్రవేశించి) రమ్మన్నారంట?

కుటుం: (చిన్నగా నవ్వి) నిన్ను కాదోయ్ చలపతీ, ఆ బ్రాహ్మణ కులపతిని తీసుకురారా అంటే నిన్ను తీసుకువచ్చాడు. ఆఁ! అదిసరేగాని శంకరం యేడి? నిన్నటినుండి కనిపించట లేదు.

చల : తెలీదండి! నేనూ అదే ఆలోచిస్తున్నాను. తమరు మన్నిస్తే ఒకటి అడగాలనుకుంటున్నాను.

కుటుం: ఏమిటది?

చల : మీకు కాబోయే అల్లుడుగారిని చూశారా అని.

కుటుం: లేదు.

చల : మరి అబ్బాయినిచూడం డే, అబ్బాయికులగోత్రాలూ, తల్లీ, దండ్రీ, ఆస్తీ, అంతస్తూ యివేమీ చూడకుండా ఈ సంబంధం ఎలా ఒప్పుకున్నారూ అని

చెం : చి...చి...చిత్తం! చిత్తం! ప ... ప... పప్పండనే దంటూరా? పె...పె...పెసరపప్పు క ....క .... కంది పప్పుకూడా వండేరండీ.

చల : పప్పుగాదు, నీ దిబ్బాగాదు నీవు ఊరోకోవోయ్

చెం : అ....అ....ఆయ్యగారూ! లో....లోన పనుందండీ. వె.... వె.... వెళ్తున్నానండీ! (చలపతివైపు చుర చుర చూస్తూ లోనికి వెళ్తాడు)

కుటుం: (తల పంకించి) ఓహో! అదా నీ సందేహం? అంతా అమ్మాయే నిర్ణయించుకుందోయ్ ! ఇక అన్నిపనులూ నిమిషాలమీద జరిపించడం మన కర్తవ్యం చూడు! బ్రాహ్మణ కులపతిని పిలిపించారటగా !

చల : చిత్తం. పిలిపించానండీ! ఇక్కడే మన మండువాలో పెళ్లి వేదిక తయారు చేస్తున్నాడు.

కుటుం: భేష్! చెప్పకుండా అన్నిపనులూ చేసుకోవాలి. అన్నట్లు పెండ్లిలో బంతికి ఎన్ని బస్తాలు వేయించావు?

చల : ఎన్నో బస్తాలెందుకండీ? కూర్చునవాళ్ళని లేపెయ్య డానికి ఓ పది పదిహేను కంచాలు చాలవంటారా?

కుటుం: అదేమిటోయ్ ! అట్లా మాట్లాడుతావ్, లేక లేక కలిగిన ఒకర్తే అమ్మాయి! ఈ పెండ్లి ఎంత ఘనంగా

నైనా జరపాలి, పదిహేను బస్తాలు తీయించి పేద లందరకూ సంతర్పణ చేయించండి. ఆఁ! అన్నట్లు ఊళ్లో అందర్నీ పిలిపించావా ?

చల : ఆడా మగా భేదమూ లేకుండా అందరికీ ఆహ్వానాలు అందినట్లే.

కుటుం: ఆఁ చూడు! మన పెద్దరైతు సూరయ్యకూ వాళ్ళ పిల్లలకి కబురు పంపించావా ?

చల : లేదండి.

కుటుం: ఏం చెప్పమన్నారూ? సూరయ్య పెద్దకొడుకు దేశ దిమ్మరిగా తిరుగుతూంటే చిన్న కొడుకు చదువూ, చదువంటూ చంక లెగరేసుకుంటూ పట్నంలో పల్టీలు కొడుతున్నాడట. ఇక సూరయ్య మతిపోయి పిచ్చి వాడై ఉన్న ఇంటికే నిప్పంటించుకొని ఊరంతా పరశురామప్రీతి అనిపించాడు.

కుటుం: (ఆశ్చర్యంగా) ఏంటీ! సూరయ్యకు మతిపోయిందా తన యింటికి తానే నిప్పంటించుకొన్నాడా ? నేను నమ్మను.

చల : మీరం నమ్మకపోయినా నిజం దాగుతుందటండీ నిజం నిప్పులాంటిది. అప్పుడే వున్న విషయం ఊరంతా పాక్కిపోయి అట్టుడికినట్లై తేనూ.

కుటుం: (జాలిగా) సూరయ్య ఎంత మంచివాడు! అంత మంచి మనిషికి ఎంత చెడ్డ రోజులు సంప్రాప్తించాయి. అంతా విధివశం! కాలమహిమ!!

చం : అంతేలెండి.

చం : బెడ్డింగు నెత్తిమీద పెట్టుకొని చేతితో మర చెంబు పట్టుకొని ప్రవేశించి కంగారుగా) అ...అ...అయ్యగారు! అ...అ...అమ్మాయిగారు వచ్చేశారండోయ్! (లోపలికి సామానులతో వెళ్తాడు. తార, చంద్రం, శేఖరం, మస్తాను వరుసగా వస్తారు.)

తార : (హేండ్ బాగ్ వూపుతూ ఆప్యాయంగా) నాన్నా!

కుటుం: రామ్మా! మీకోరకే ఎదురు చూస్తున్నాము.

తార : (చంద్రాన్ని చూపిస్తూ) నాన్నా! వీరే చంద్రంగారు.

చం : నమస్కారమండీ.

కుటుం: నమస్కారము

తార : (శేఖర్ని చూపిస్తూ) వీరు చంద్రంగారి స్నేహితులు, శేఖర్ బి. ఏ.

శేఖ : నమస్కారమండీ

కుటుం: నమస్కారము.

తార : (మస్తాన్ని చూపిస్తూ) ఇతను చంద్రంగారి నౌకరు మస్తాన్, చాలా నమ్మకం గలవాడు.

మస్తా: (ఒంగి నమస్కరిస్తూ) సలామ్ లేకుం సాబ్.

కుటుం: (నవ్వుతూ) ఆఁ! సలామ్! అలామ్! చాలా బావుంది, ముందు లోనికి పదండి. ముహూర్తానికి వేళవుతుంది.

చెం : (లోపలనుంచి వచ్చి ఆత్రుతగా) అ .... అ.... అయ్య గారూ! అయ్యగారూ! బా .... బా .... బాపనయ్య గోరూ బే.... బే.... బేగా రమ్మని గోలెడుతున్నాడండీ.

కుటుం: ఆఁ! ఆఁ వస్తున్నాం! అమ్మాయి! లోనికి పదండి! అబ్బాయి చంద్రం లోనికి పద

చం : అలాగేనండి! రారా శేఖర్! (ముందు తార, వెనుక చంద్రం, శేఖర్, మస్తాన్, చెంచయ్య లోనికి వెళతారు)

కుటుం: ఆఁ! చలపతీ! నీ విక్కడే వుండి వచ్చే అధితుల్ని ఆహ్వానిస్తూ లోనికి పంపించు (లోనికి వెళ్తాడు)

చల : చిత్రం! (ఈర్ష్యగా కుటుంబరావు వెళ్తున్న వైపు చూచి) ఛీ! ఛీ! ఎంత పొరపాటుపని చేసాడు ఈ శంకరం! ఈ పెండ్లి జరగనీకునని కంకణం కట్టుకున్న శంకరం ఏ డొంకలో తగులున్నాడో! యింకా ఊడి పడలేదు! తలచినదొకటి, జరిగింది ఇంకొకటి! మన ప్లానంతా తలక్రిందులైపోయింది. ఏది ఏమైనా నాకు శంకరం యిచ్చిన అయిదువేలూ అక్షరాలాదక్కే యి అంతేచాలు. పంతులమ్మ యింటికి నిప్పు పెట్టింది నేనైతే ఈ నేరం సూటిగా సూరయ్యపై పడ్డాది.

(ఇంతలో సూరయ్య వస్తాడు, తల, గడ్డం బాగా పెరిగి మాసి చిరిగిన బట్టలు ఒళ్ళంతాదుమ్ము దూసరంతో వుంటుంది. వచ్చే సూరయ్యను చలపతి చూచి త్రుళ్ళిపడి నెత్తిమీద ముసుగు వేసుకొని మరో మూలగా తిరిగాడు. సూరయ్య చలపతిని గుర్తుపట్టలేక పోయాడు.)

సూర : దండాలండి బాబుగారూ !

చల : (ముఖం కనుపించకుండగా మరోవైపు తిరుగుతూ) ఎవరూ నీవూ? ఎందుకొచ్చావు?

సూర: నేను బాబు సూరయ్యను.

చల : ఏం కావాలి నీకు?

సూర: పెద్దయ్యగార్ని కలుసుకోవాలి.

చల : వారితో నీ కేంపని?

సూర: కష్టసుఖాలు చెప్పుకోవాలని వచ్చాను బాబూ.

చల : ఏమిటి నీకు కలిగిన కష్టం? ఎవరు కలిగించారు?

సూర: కంచె చేను మేస్తుంటే రైతు ఏమిచేయగలడు బాబూ! ఏం చెప్పుకోను బాబూ! ఆ నరరూప రాక్షసుడు, పేదల పాలిట పెద్ద దెయ్యము. ఆ చలపతి గాడు నాయింటి ప్రక్కనున్న పంతులమ్మ యింటికి నిప్పుపెట్టాడు దానితో పేటంతా బూడిదైంది పాపం! ఆ పంతులమ్మ నిండు మనిషి ఇంటిలో నుండి తప్పించుకోలేక ఆ యింటిలోనే నిలువునా కాలి

పోయింది. (కన్నీళ్ళు తుడుచుకొంటూ) పాపం పెరిగి పోతుంది బాబూ! ఇన్ని అన్యాయాలు అయ్యగార్కి తెలియకుండగా జరుగుతున్నాయని అనుమానంగా వుంది బాబూ!

చల : (ఆ మాటలు వింటూ భయంతో, కోపంగా నిలువెల్లా వణికిపోతాడు)

సూర : అయ్యగారి మనసు వెన్నలాంటిది బాబూ! మావంటి బీదల బాధలు యెప్పటికప్పుడు తెలుసుకుంటూ, ఆ కష్టాల్ని, నష్టాల్ని మాతో సమానంగా పంచుకుంటు మమ్మల్ని కన్నబిడ్డలుగా చూచుకుంటున్న ఆయన కళ్ళు విప్పి శంకరం, చలపతి ఆడే కపట నాటకాన్ని అయ్యగార్కి కనువిప్పుగా చెప్పుకుందామని వచ్చాను బాబూ!

చల : (ముసుగు తీసి సూరయ్యవైపు తిరిగి వికృతముగా నవ్వుతాడు) అహహా అయ్యగార్కి కనువిప్పటానికి వచ్చావా? లేక యీ చలపతి చేతిలో చావటానికి వచ్చావా?

సూర : (ఆశ్చర్యంగా) ఆఁ! నువ్వా? దుర్మార్గుడా! ఇంకా నీపగ తీరలేదా మమ్మల్ని ఇంకా ఏం చెయ్యాలని ఈ దొంగనాటకం?

చల : (వికృతంగా నవ్వుతూ) అహహా! దొంగనాటకం కాదురా ముసలిముండాకొడుకా! ఇప్పుడు యీ చలపతి చేతిలో ఎలా చస్తావా అని ఆలోచేస్తున్నాను. (కొట్టటానికి ప్రక్కనున్న కుర్చీ యెత్తుతాడు)

మస్తా: (మీసం దువ్వుతూ) తూత్తేరి ! బేవకూఫ్! ఆ ముసలి బాబూ నీకీ హేమిటీ అప్పకారం చేసినాడ్? నీకీ పేదాసాదల్ కి దయా నై! నీకీ గుండెబండా హైయింది హేంట్రా బద్మాష్! (కుర్చీ ఎత్తుతాడు)

చల : అమ్మబాబోయ్! చంపేస్తున్నాడు. (మస్తాన్ కాళ్ళ మీదబడి నమస్కరిస్తూ) మస్తాన్ సాహేబ్ గారూ నన్ను మన్నించండి! నన్ను చంపక వదలండి. (భయంతో గడగడ వొణుకుతాడు)

సూర (జాలిగా) పోనీలే బాబూ దుర్మార్గుడైనా, సన్మార్గానికి రాగలిగాడు. పాపం! పశ్చాత్తాపపడుతున్నాడు చేసిన పాపానికి పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదు

మస్తా: అరే! వురో! చెంపల్కి వేసుకోని చల్లగా జారు ఎత్తిన కుర్చీ దింపుతాడు చలపతి లెంపలు వాయించుకొని బెదరుతూ నెమ్మదిగా లోనికి జారుతాడు) బాబూ! మీకీ మాట నమ్మి వాడ్కి వదలి పెట్టాన్ కానీ హీడ్కీ నమ్మకూడదూ హండీ. హేరుదాటి తెప్ప తగలబెట్టే భద్మాకూష్ హండీ.

సూర: నన్నాపదలో వచ్చి దేవుడులా ఆదుకున్నావు నాయనా నీవెవరవూ? ఏమిచ్చి నీఋణం తీర్చుకోగలను? ఎండవానల్లో తడిచి చితికిన ఈ దేహం కష్టాలతో

కృంగి కృశించిపోయిన ఈ మనస్సు ఈ రెండూ తప్ప మరేమీ నాదగ్గర లేవు. (వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ) నాకున్న రెండు జాలి పుత్రరత్నాలు దగ్గర లేకుండగా పోయారు. నిరంతరం కన్నీటితో కండ్లుతడుపుకుంటూ, భరించరాని బాధల్ని భరిస్తూ బరువుగా యీ బ్రతుకును ఈడ్చుకొస్తున్నాను. (ఆ వేదన ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తాడు)

మస్తా: (అటూ నిటు చూచి వచ్చే దుఃఖాన్ని ఆపుకొని) బాబూజీ! మీకే ఏమీ పర్వాలేదు! మీకి బేటల్ హాయిగా వుండార్! అతి త్వరలో వార్ని కలుసు కుంటార్!

సూర: (కారే కన్నీరు తుడుచుకుంటూ ఆత్రుతగా) బాబూ నిజంగానా! నాబిడ్డలు నన్ను కలుస్తారా? చెప్పు బాబూ! ఈ చల్లనిమాట నీ నోటితో మరొక్క సారి చెప్పండి బాబూ! మీకు చెయ్యెత్తి దండం తాను. (రెండు చేతులెత్తి నమస్కరించబోతాడు)

మస్తా: (దుఃఖాన్ని ఆపుకొని సూరయ్య చేతులు పట్టుకొని) బాబూ! ఎంతపని చేస్తున్నార్! మేము మీకీ బిడ్డలం! మీరూ పెద్దలు పెట్టకూడ్దు హాండీ! (అతని చేతులు వదులుతాడు)

సూర: (చేతితో గుండె పట్టుకొని బాధతో మూలుగుతూ) అమ్మా! (శ్వాసపీల్చి) బాబూ! ఏజాతివైనా, ఏ

పట్టుపైనా పెన్నుప్రాసలాంటి మనస్సు మీద (పొడి దగ్గు దగ్గుతూ) అబ్బ!

మస్తా: అరే హేమ్మి పాండీ బాటికి మూలుగుతున్నార్? దెబ్బ తగిలిందా పాండీ!

మస్తా: (అతని శరీరాన్ని తాకి చూస్తూ) బాబూజీ, మీరు హూర్కుంటే వాడ్కి నెత్తిమీద కూర్చుండీ నెత్తి పగిలి చిత్తుహయ్యేవాడు.

సూర: పోనీలే బాబూ! బలిమిని బలిమి కొడితే బలిమిని భగవంతుడు కొడతాడు

మస్తా: హాఁటూ ఊర్కుంటే వీడ్కి దుండగాల్ మితిమీరి వుండాయ్.

సూర: అలాగే వుంది. ధనానికి దాసోహం చేసే ఈలోకంలో మంచికి మార్గంలేదు బాబూ

మస్తా: జీ బాబూ మనం అందరం కష్టపడి మార్గాన్ని చేయాలి (ఇంతలో ముందు చలపతి, వెనుక కుటుంబరావు, చెంచయ్య వస్తారు)

చల : (మస్తాన్ని కుటుంబరావుకు చూపిస్తూ) వీడేనండీ మతిలేని మనిషిని పట్టుకొని కొట్టి చంపబోతుంటే నేను ఆదుకొని చెప్పటాకని పరుగెత్తుకొని మీ వద్దకు వచ్చాను.

కుటుం: ఏరా తురక వెధవా! తెరవంటేసి ముసలివాణ్ణి పట్టుకొని చంపుతావట్రా? (కోపముతో చేతిలోవున్న కర్రతో మస్తానును కొట్టబోతాడు)

సూర: బాబూ! (ఆశ్చర్యంగా) ఆగండి! (మస్తాన్ని ఆపుకోబోతాడు. మస్తానుకి తగలవలసిన దెబ్బ తనకుతగులుతుంది అబ్బా అంటూ క్రిందపడ్తాడు.)

మస్తా: బాబూజీ! (క్రిందపడుతోన్న సూరయ్యను పట్టుకొని నెమ్మదిగా ఆపుతూ తన తొడపై పండుకోబెట్టి రక్తాన్ని తుడుస్తుంటాడు )

కుటుం: (విచారిస్తూ) ఎంతపని జరిగింది! ఆఁ! చలపతీ! నీవు పోలీసు స్టేషనుకి వెళ్ళి చెప్పిరా! ఒరే చెంచయ్యా నువ్వెళ్ళి డాక్టరుకు ఫోన్ చెయ్యి. వెళ్ళండీ, (తొట్రుపాటున ఏమీపాలుపోక అటూ ఇటూ తిరుగుతాడు.)

చం : చిత్తం! (మస్తానువంక కళ్ళెఱ్ఱజేసి చూచి) బయటకు వెళ్తాడు.

మస్తా: (కుటుంబరావును చూచి) బాబూజీ ఒకటీ మా

కుటుం నోర్ముయ్! నీమాటలతో నామనస్సు మార్చలేవు. దుర్మార్గుడా! మంచివాడవనుకున్నాను. మళ్ళీ మాట్లాడేవంటే డొక్క చీలుస్తా జాగ్రత్త.

సూర: (నెమ్మదిగా మూలుగుతూ అమ్మా! ఆఁ! అమ్మా.

కుటుం: (సూరయ్య దగ్గరకు వచ్చి నాడి చూసి విసురుతూ) సూరయ్యా! సూరయ్యా! నేను ఇదిగో ఇలా చూడు.

సూర: (కండ్లు మూసుకొని బాధగా) బాబూ! మీరేనా?

కుటుం: అవును. సూరయ్యా నేనే అయ్యా! ఎలాంటివాడవు ఎలా అయిపోయావు! (మరల నాడి చూచి విసురు తుంటాడు.)

మస్తా: (నెమ్మదిగా లేచి ప్రక్కగా వుండి తలపంచుకొని బాధపడుతూ వుంటాడు)

సూర: (బాధతో లేవబోయి పడి) ఆఁ! అబ్బా! ఆయనేడీ? ఎక్కడున్నాడు?

కుటుం: ఎవ్వరూ? ఈ తురక వెధవేనా? దుర్మార్గుడు. ఇక్కడే వున్నాడు. ఇప్పుడే వీడిని పోలీసులకు వప్ప గిస్తాను.

సూర: బాబూ! అతను నిర్దోషి! చెప్పుడు మాటలు నమ్మి తొట్రుపాటుతో మీరతన్ని అపార్థం చేసుకున్నారు.

కుటుం: (ఆశ్చర్యంగా) ఆఁ! అతను నిర్దోషా? అయితే నీకు మతిపోయిన సంగతి నిజమేనన్నమాట.

సూర: నాకు మతిపోలేదు బాబూ? నాస్థితిగతులు మారి పోయాయి. ఈ జమీందారే ఒక గుడ్డి దర్బారు అయి పోయింది.

కుటుం: (మరింత ఆశ్చర్యంగా) సూరయ్యా! నీవేనా మాట్లా డేది?

సూర: అవును బాబూ! నేనే మాట్లాడేది. ఈ మతిపోయిన ముసలి సూరయ్యే మాట్లాడేది. తమరు ఇంట్లోనుండి

బయటకు రాకుండగా ఆస్తినీ, అధికారాన్ని దుర్మార్గుల చేతిలో వప్పగించారు. అందరూ మీలాంటి వారేనని నమ్మారు. నేడు మీకనుచాటున యెంతటి ఘోరమైన కార్యాలు జరుగుతున్నాయో నేను చెప్పితే మీరు నమ్మలేరు. అధికారం అస్త్రగతం చేసికొని అహంకారంతో అమాయకులైన పేద రైతుల జీవితాన్ని నాశనం చేస్తున్నారు.

ఆఁ! నాజమీలోనా? ఎవరు

ఇంకెవ్వరు బాబూ! మీ మేనల్లుడు శంకరం. మీ పేరుతో చలపతిద్వారా చెప్పరానంతటి దుర్మార్గపు కార్యాలు చేయిస్తున్నాడు.

(ఆశ్చర్యంగా) ఆఁ! శంకరం, చలపతేనా? ఇదంతా నిజమా సూరయ్యా?

బాబూ! నానోటితో అబద్దమన్నా శబ్దం ఏనాడైనా విన్నారా

(ఆవేశంతో) ఏం చేసారు ?

ఏం చెప్పమన్నారు బాబూ! ఒకటా-రెండా వీళ్ళు చేసే దుండగాలు! వెయ్యి నోళ్ళుగల ఆదిశేషుడైనా వరించి చెప్పలేడు. ఈ ఊరిలో నాలుగు అక్షర ముక్కలు చెప్పి పొట్ట పోషించుకునే ఆ దిక్కులేని

[illegible] గర్భవతి [illegible]
రట్టవుతుందని నిన్నరాత్రి ఆతల్లి యింటికి నిప్పంటించాడు. దానిలో ఊరంతా బూడిదైంది. ఆతల్లి తప్పించుకోలేక కడుపులోనున్న బిడ్డతోసహా ఆఇంటిలోనే నిలువునా కాలిపోయింది బాబూ (ఇక చెప్పలేక కుమిలి కుమిలి ఏడుస్తాడు.)

కుటుం: ఆఁ! ఎంతపని చేసారూ? సూరయ్యా! ఇంతకీ యీ పని చేసిందెవరూ?

సూర: (కన్నీళ్ళు తుడుచుకుంటూ) ఇంకెవ్వరు బాబూ మీ గుమస్తా చలపతి!

కుటుం: ఆఁ! చలపతా! మరి నీవే నిప్పంటించావని చెప్పేడే!

సూర: అవును బాబూ! చలపతి యింటికి నిప్పంటించి పారిపోతుంటేను నేను చూచి అడ్డుకున్నాను. నన్నుకొట్టి పారిపోయాడు. మాపేట యువజనసంఘం కుఱ్ఱవాళ్ళందరూ వెంటబడి తరిమారు. అయినా తప్పించుకు పారిపోయాడు. ఇక చేసేదిలేక పోలీస్ స్టేషన్‌కు ఈ సంగతి తెలియజేసారు.

కుటుం: ఆఁ! తర్వాత?

సూర: ఈ దాగిన నిజం కనువిప్పుగా మీకు తెలియ జేయాలని వస్తే నన్ను పట్టి చంపబోయాడు. (మస్తానును చూపించి) అంతలో దేముడిలా ఈ బాబు వచ్చి నన్ను

రక్షించాడు. లేకపోతే జీవంతో తమర్ని చూచే భాగ్యం నాకుండేది కాదు. (దండంపెట్టి వెక్కి వెక్కి ఏడుస్తాడు.)

కుటుం: అయితే నిన్ను కొట్టింది మస్తాను కాదా? అనవసరంగా చెప్పుడుమాటలు విని యెంతపని చేశాను? (పశ్చాత్తాప పడతాడు.)

మస్తా: పర్వానై బాబూజీ పర్వానై! ఇప్పటికి మీకు నిజం తెల్సుకున్నార్. మాకీ హంతేచ్చాల్ బాబూజీ.

సూర: (కుటుంబరావు చేయూతతో నెమ్మదిగా లేచి నిలబడతాడు.)

తార: (పెండ్లికుమార్తె వేషంలో ప్రవేశించి సూరయ్య తలపైన తగిలిన గాయాన్ని చూచి ఆశ్చర్యంగా) ఇంతకీ ఇక్కడ యేం జరిగింది నాన్నా!

కుటుం: ఏమీ లేదమ్మా.

సూర: అమ్మాయిగారు పట్నంనుండి ఎప్పుడొచ్చారు బాబూ?

కుటుం: ఈరోజే వచ్చింది. నీ వొచ్చేముందు అమ్మాయికి పెండ్లికూడా జరిగింది. ఆ పెండ్లిసందడిలోపడి నీవు రావటంసంగతే గమనించలేకపోయాను.

సూర: పోనీలే బాబూ! ఆ మూడుముళ్ళూ పడితే అంతే చాలు! ఇంతకీ అదృష్టవంతు డెవరు బాబూ? (ఇంతలో చంద్రం పెండ్లికుమారుని వేషంతో వస్తాడు. సూరయ్య వచ్చే చంద్రాన్ని చూచి పిలవబోయే సమయంలో)

కుటుం: అదుగో! అబ్బాయి వస్తున్నాడు.

సూర : (వచ్చే చంద్రాన్ని చూచి తనకొడుకా? కాదా? అని అనుమానంతో కండ్లు నులుపుకొని దగ్గరకు ఆత్రుతగా వెళ్ళబోయి పడిపోతాడు. పడిపోకుండా మస్తాన్ పట్టుకుంటాడు. తిరిగి సూరయ్య-బాబూ! అని పిలువబోవగా మస్తాన్ పిలువనీయకుండగా సూరయ్య నోరు నొక్కుతాడు)

కుటుం; (ఆ దృశ్యాన్ని చూచి నిర్ఘాంతపోయి) ఆఁ! ఏమి టది? అబ్బాయినిచూచి సూరయ్య అలా మారిపోయాడే. చెప్పండి! (ఎవ్వరూ మాట్లాడరు) ఏవరూ మాట్లా డరు! చెప్పండి. (గట్టిగా అరుస్తాడు. ఇంతలో శంకరం ప్రవేశిస్తాడు. అతనిజుట్టు రేగి వుంటుంది. కండ్లునిప్పులు క్రక్కుతున్నట్లు బాగా కోపముతో యెర్రబారి వుంటాయి )

శంగ : (వికటంగా నవ్వుతూ) అహాహా! నేను చెపిస్తాను

మస్తా: (ఆశ్చర్యంగా) ఆఁ! నువ్వా ?

శంక : అవును నేనే! (తీవిగా) మీకపట నాటకాన్ని బయట పెట్టి మిమ్మల్నందర్ని కడ తేర్చడానికి వచ్చింది నేనే! (చెరిగిన జుట్టును సర్దుకొని నడుంమీద చేతులు పెట్టు కొని తీవిగా నుంచుంటాడు.)

మస్తా: కబడ్ దార్! (శంకరం మీదికి ఉరకబోతాడు)

శంక: (పేంటులో పిస్టల్ తీసి గురిపెడుతూ) హేండ్సప్. (వికటంగా నవ్వుతూ) కాలుకదిపేవా కాల్చేనన్న మాటే! (తారను ఉద్దేశించి) ఓహో! తారాదేవా! ఎంతపనికి సాహసించేవు? దరిద్రుడైన సూరయ్య చిన్నకొడుకే నీవరుడు కావచ్చేడా.

కుటుం: నిర్ఘాంతంగా ఆః! నిజంగా! చంద్రం ఈ సూరయ్య కొడుకేనా? (దిగులుగా తల రెండు చేతులతో పట్టుకొని కుర్చీలో కూలిపోతాడు. చెంచయ్య తన కండువాతో యిసురుతుంటాడు.)

తార: (నిరాశగా చంద్రాన్ని నుద్దేశించి) ఏమండీ! మీరు చాలా మంచివారనుకున్నాను. మీరు ఎంత మోసం చేసారండీ! (పైటతో కన్నీళ్ళు తుడుచుకుంటూ తండ్రి కుర్చీ నానుకొని నుంచుంటుంది)

చం: తారా! నిన్నేమీ మోసం చెయ్యలేదు. ఎన్నో సార్లు "నేను పేదవాడి" నని చెప్పాను. కాని నీవే నా మాటలు త్రోసిపుచ్చి "చాల్లెండి" అని కప్పిపుచ్చేదానవు. ఇందులో మోసమేముంది?

సూర: (కోపంతో) మోసం కాదట్రా! నక్కెక్కడ నాగలోకమెక్కడ? వారంతస్తెక్కడ? మన అంతస్తు ఎక్కడరా? (చంద్రాన్ని కొట్టటానికి చెయ్యి యెత్తుతాడు.)

శేఖ: ఆగండి! (సూరయ్యను ఆపుచేసి) ఇందులో మోస మేమీ లేదు. ప్రేమించి పెండ్లి చేసుకున్నారు. ప్రస్తుత రోజుల్లో అంతస్తులూ, ఆస్తులతో పని లేదు. మన సుంటే మార్గమున్నది. అయినా ధనంలో తప్ప తారకు చంద్రం దేనిలో తక్కువ? చదువు లేదా-సంస్కారం లేదా?

శంక: అన్నిటికీ మించిన ఆశవుంది, చాలదూ?

సూర: (చేతులు నలుపుకుంటూ) బాబూ! ఏదో తెలిసో తెలియకో చేసిన తప్పు క్షమించండి. (కుటుంబరావు కుర్చీ ప్రక్కన కూర్చుని కాళ్ళకు దండం పెడతాడు.)

తార: (ఏడుస్తూ) నాన్నా! నన్ను క్షమించు నాన్నా! (నెమ్మదిగా కుర్చీలో కూర్చుని విచారిస్తున్న కుటుంబ రావు కుర్చీ వగ్గర కూర్చుని అతని తొడపై తలనాన్చి ఏడుస్తాది.)

కుటు.: (తార నిమురుతూ ఆమె కన్నీళ్ళు తుడుస్తూ ఆనంద భాష్పాలు రాలుస్తూ) క్షమిస్తానమ్మా క్షమిస్తున్నాను. (కనులు నులుపుకొని చిరునవ్వుతో) ఏది ఏమైనా నీకు తాళికట్టినవాడే భర్త! చంద్రం. నా అల్లుడు. దాన్ని ఇంకెవరూ కాదనలేరు (తారమీద ఒక చేయి-సూరయ్యమీద ఒక చేయి వేస్తాడు. నాన్నా! అని తార, బాబూ! అని సూరయ్య ఒకేసారి ఆనందంతో అంటారు. కుర్చీ

వెనుకనున్న చెంచయ్యా చిరునవ్వుతో రుమాలుతో విసరడం మాని నడుంకికట్టుకొని పొరపాటుపడినట్లు గబగబా విప్పి జోరుగా విలురుతాడు. మస్తాను నవ్వుతూ గెడ్డం సవరించుకొంటాడు, శిలాప్రతిమలా నుంచున్న చంద్రాన్ని శేఖర్ నవ్వుతూ భుజం తడతాడు. చంద్రం ఉలిక్కిపడి చిరునవ్వుతో పేంటు జేబులో చేతులు పెట్టుకొని వుంటాడు.)

శంక: (ఆదృశ్యాన్ని చూచి గట్టిగా) మావయ్యా! అహాహా నీ మేనల్లుడు బ్రతికుండగా మరొకర్ని నీకంటికో అల్లుడిగా చూడలేవు.

కుటుం: నోర్ముయ్! చంద్రం తారకు శాస్త్రయుక్తంగా తాళికట్టిన భర్త!

శంక: (విషపు నవ్వు నవ్వుతూ) అహాహా! తాళి కట్టేడా తాళి! కట్టిన తాళి త్రెంపుతాను. తాళికట్టినవాడ్ని చంపుతాను ఏది ఏమైనా నాతార నాకు కావాలి. (గబగబా వెళ్ళి తార చెయ్యి పట్టుకొని తనవైపుకు లాగుకొని పోతాడు. తార విదిలించుకోబోతాది. కాని అతడు విడవనందున అతనిచేతిని కరుస్తుంది.)

చం: ఆగు! (కోపంతో శంకరంవైపు వెళ్ళబోతాడు)

శంక: (తారను ఒక చేతితో పట్టుకొని మరియొక చేతితో పిస్టల్‌తో చంద్రానికి గురిచూపుతూ వికటంగా నవ్వుతూ) అహాహా! చంద్రం! నీవక్కడే ఆగు!

అడుగు ముందుకు వేస్తే గుండెలోనుండి రక్తం నేలపై ధారగా కారుతుంది.

చం: దుర్మార్గుడా! ఆడదాన్ని అపహరించుకుపోయే నీకంత ధైర్యమా? నిన్నేం జేస్తానో చూడు! (ముందుకు వస్తాడు)

శంక: నోర్మూయ్! (కోపంతో పిస్తోల్ పేలుస్తాడు)

మస్తా: ఆగు! (చంద్రానికి అడ్డువచ్చి పిస్తోల్ దెబ్బకు గురి అవుతాడు. అబ్బా అంటూ క్రింద పడిపోతాడు. గెడ్డం, మీసాలు ఊడిపోతాయి. అందరూ ఆశ్చర్యముగా చూస్తుంటారు. శంకరం కంగారుగా తారను తీసుకొని బలవంతగా బయటకు వెళ్ళబోతుండగా యస్. ఐ. ఇద్దరు పోలీసులు వస్తారు.)

ఎస్ ఐ. (పిస్తోల్ శంకరానికి గురిచూపుతూ) హేండ్సప్. (శంకరం పిస్తోలును క్రిందకు జారవిడుస్తాడు) ఏయ్! ఫోర్ నాట్ ఒక్! చూస్తావే? బేడీలు తగలించు నైంటీ టూ చేతులు లాగవో.

92
401 } యస్! సార్. ఏమోయ్ ఆ అమ్మాయిని వదులు

ఎస్. ఐ (శంకరాన్ని చూచి) నిన్నేనండీ! అలా కొయ్యబారి పోయావే! వదులు (పోలీసులకు సైగ చేస్తాడు)

401: ఇతను గ రా నా మనిషండీ! ఆ చలపతిగాడ్ని వాయించినట్లు వాయిస్తే వదుల్తాడు. (లాఠీ అదలించ బోతాడు. శంకరం తారను వదులుతాడు. తార కుటుంబరావు ప్రక్కకు వెళ్తాది,)

92 : ఇలాంటోడ్ని వాయించకూడదురా! కాళ్ళూ చేతులు, కట్టి మంటలో పడేయాలి. లేకపోతే ఆ చలపతికి ఐదువేలు యిచ్చి ఆ పంతులమ్మ యింటికి నిప్పు పెట్టమంటాడా? (శంకరం చేతికి బేడీలు తగిలిస్తాడు)

ఎస్. ఐ (పడిపోయిన సూర్యాన్ని పరిశీలిస్తాడు. అతనిటోపీ గెడ్డం, మీసం పూర్తిగా తీసి ప్రక్కన పెడతాడు. అందరూ ఆశ్చర్యంగా చూస్తారు.)

చం : (ఆ పడిపోయినవాడు తన అన్న సూర్యం అని గుర్తించి ఆశ్చర్యముగా) ఆఁ ఎవరూ?

సూ : (బాధగా) నేనే తమ్ముడూ! సూర్యాన్ని! (శేఖర్, తార, సూరయ్య, కుటుంబరావు ఒక్కసారిగా ఆశ్చర్యముగా 'ఆఁ! సూర్యయా?' అని అంటారు.)

చం : గట్టిగా) అన్నయ్యా! (మీదపడి ఏడుస్తాడు, కళ్ళు నులుపుకుంటూ బాబూ! సూర్యం! అంటూ సూరయ్య సూర్యంమీదపడి ఏడుస్తాడు)

ఎస్ ఐ: కుటుంబరావుగారు! గడచిన దానికి ఆలోచించినా లాభం లేదు. త్వరగా డాక్టర్ని పిలవండి.

శేఖ: చంద్రం! భయపడకు, నేనిప్పుడే డాక్టర్ని తీసుకు వస్తాను. (గబగబా బయటకు వెళ్తాడు)

ఎస్. ఐ: (లేచి టైం చూచుకొని) క్షమించండి కుటుంబరావు గారూ! మీ మేనల్లుడు శంకరం, మీ గుమస్తా చలపతి చెప్పరాని నేరాలు చేశారు. వీరికోరకు మేము గాలిస్తుండగా చలపతి స్టేషనుకు వచ్చి మీరు రమ్మనట్లు చెప్పాడు వెంటనే అతన్ని అక్కడే అరెస్టు చేసి నాలుగు వాయించగా పంతులమ్మ యిల్లుశంకరం ప్రోద్బలంవల్ల అయిదు వేలు తీసుకొని అంటించానని అన్నాడు. ఇక శంకరాన్ని కూడా తీసుకు వెళ్ళక తప్పదు. ఒకటికి రెండు నేరాలు!

కుటుం: నా కేమీ దిగుల్లేదు, తీసుకు వెళ్ళండి! యిలాంటి చీడపురుగులు నశించడమే నాకు కావాలి.

ఎస్. ఐ: ఆల్ రైట్! డాక్టరు వచ్చిన తరువాత ఇతనికి ఎలా వుందో ఫోన్ చెయ్యండి! (సిగరెట్టు వెలిగించి) ఏయ్! ఫోర్ నాట్ ఒన్! తీసుకుపదండి! (ముందు పోలీసుల శంకరం, వెనుక ఎస్. ఐ. బయటకు వెళ్తారు)

చం : అన్నయ్యా! (భోరుమంటాడు)

సూ : (నవ్వుతూ లేస్తాడు) తమ్ముడు...! (అంతా ఆశర్య పోతారు)

సూర: బాబు!

సూ : నాన్నా! (కౌగిలించుకుంటాడు.)

చం: అయితే ఆ పిస్తోలు...!

సూ: ఆ పిస్తోలు పేలడమేగాని, కాలదురా!

కుటుం: అంటే?

సూ: ఇలా జరుగుతుందని నాకు ఏనాడో తెలుసు. అందుకే శంకరానికి మారువేషంలో మత్తుమందు యిచ్చి, పిస్తోలు మార్చివేశాను.

కుటుం : మంచిపని చేశావు. లేకపోతే నిజంగా నీ ప్రాణాలు తీసేవాడు దుర్మార్గుడు.

సూ: (కుటుంబరావుగారి దగ్గర కూర్చొని) క్షమించండి బాబుగారు, తారాచంద్రుల అనురాగానందానికి అంతం కలుగకూడదని యిలా చేశాను. అంతేగాని, మీ ఆస్థి కాశించి యిలా మారువేషాలతో మోసం చేయాలని కాదు.

కుటుం: (సూర్యాన్ని అనురాగముతో ఆదరిస్తు) లే సూర్యా నీవు నిజంగా నిస్వార్థపరుడవు, నీ త్యాగానికి నిజంగా ఎంతో అభినందించాలి. నీలాంటి ఉత్తముడ్ని కన్నందుకు సూరయ్యా కాదు మా బావ, నీ సోదరుడు చంద్రం కాదు, నా అల్లుడు యెంతగానో అదృష్ట వంతులు

సూర: బాబూ...(ఆశ్చర్యంతో)

కుటుం: బాబుకాను బావ అను. బావ! మీతండ్రీకొడుకులు. అన్నదమ్ముల అనురాగపాశమైన రక్తపాశం చాలా పవిత్రమైనది.

కుటుం: (తన వద్దనున్న తాళాలు సూర్యంకు) యిస్తూ ఇదిగో సూర్యం ఈరోజునుండి, యీ యింటిపెత్తనమంతా నీదే. ఇక మా బావ నేను కాశీప్రయాణం ఏంబావ?

సూర: అంతా మీదయ బాబుగారు

కుటుం: చూడు సూర్యం తారాచంద్రులు హానీమూన్‌కి ఎంత డబ్బు కావాలో యిచ్చి పంపించు. రా బావా భోజనం చేద్దాం. (సూరయ్యను చెయ్యిపట్టుకొని, M. B. లోనికి తీసుకొని వెళ్తాడు.) (తార సిగ్గుతో చంద్రంప్రక్కకు వస్తుంది.)

సూ: సూరే అమ్మగార్, తారాభాయ్ గార్ మీకీ హేమ్టీ కావాలండి. (అంతా నవ్వుతారు) ఆ తమ్ముడు నేను. అలా యువజన సంఘం ఆఫీసుకి వెళ్ళి వస్తాను మీరు హానీమూన్ ప్రయాణానికి సిద్ధమవ్వండి. (L. F. లోకి వెళ్తాడు.)

తార: అమ్మదొంగ ఎంత నాటకమాడావు.

చం: తార నేనుకాదన్న, కలసి, వలసి గెలిసికొన్నది. నీవు నన్నెందుకు ఆడిపోసుకుంటావు. అవున్లే, మీఆడవాళ్ళ బుద్ధేయింత. (అని ముద్దెట్టుకోబోతాడు.)